# రాణాప్రతాపసింగ్

చారిత్రక

నాటకము

విశాఖపట్టణమందలి సి. బి. ఎమ్. హైస్కూలులో

ప్రథానాంధ్రోపాధ్యాయులును,

రసపుత్రవిజయనాటక గ్రంథకర్తయునగు

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారిచే

రచింపబడియె.

ప్రకటనకర్త

కురుకూరి సుబ్బారావు

బుక్కు సెల్లరు అండ్ పబ్లిషరు,

భీమడోలు, (కృష్ణాజిల్లా)

 1925. వెల 1-0-0

కాకినాడ

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె

శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము

(రాణాప్రతాపసింగ్)

చారిత్రిక నాటకము

విశాఖపట్టణమందలి ఎ. వి. ఎన్. హైస్కూలులో
ప్రధానాంధ్రోపాధ్యాయులును,
రాజపుత్రవిజయనాటక కర్తయు నగు
ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారిచే
రచింపఁబడినది

ప్రకటనకర్త:
కురుకూరి సుబ్బారావు,
బుక్కుసెల్లర్ అండ్ పబ్లిషర్,
భీమవ్రోలు, కృష్ణాజిల్లా

రెండవ కూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:
కోటమర్తి చినరఘుపతిరావుగారిచే
కాకినాడ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.
1925



[వెల 2—0—0

# నాటకమున వచ్చు పాత్రములు.



పురుషులు.

రాణాప్రతాప్‌సింగు—కథానాయకుఁడు, చిత్తూరు రాణా.

బాణభట్టు—ప్రతాపుని యనుచరుఁడు.

జయసింగు—ప్రతాపుని సర్దారుఁడు, మోహిని భర్త.

అమరసింహుఁడు—ప్రతాపుని పుత్త్రుఁడు.

అక్బరు—ఢిల్లీ ఫాదుషా.

సలీమ్—అక్బరు కుమారుఁడు.

గులామ్—సలీమ్ సేవకుఁడు.

మానసింగ్—జయపురపు రాజు, పాదుషాయన్సర్దారు.

పృథ్వీరాజు—ప్రతాపుని బావ.

సాగ్రజీ—ప్రతాపుని సోదరుఁడు.

అబుల్ ఫజల్—అక్బరు గురువు.

వజీర్—అక్బరుమంత్రి.

రణమల్లుఁడు—రత్నపూర్ రాజు, మోహిని తాత.

భిల్లులు, సిద్దీలు, అర్చకుఁడు, జాంఘికుఁడు మొదలగువారు.

స్త్రీలు.

కరుణాదేవి—ప్రతాపుని భార్య.

కమల—ప్రతాపపుత్త్రి, పసిబిడ్డ.

మోహిని—రణమల్లుని దౌహిత్రి, జయసింహుని భార్య.

కమలాదేవి }
చిత్రకారిణి } పృథ్వీరాజు భార్య, ప్రతాపుని సోదరి.

చంద్రికళ—బోగముది. సాగ్రజీ యుంపుడుకత్తె.



శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము.

## (రాణాప్రతాపసింగు)



పాంకె





భక్తాశ్రిత పారిజాతము, రమాసీమంతినీమానసా
బ్జాభివ్యాప్త మనోజ్ఞభృంగము, జగద్వ్యాకీర్ణసంపూర్ణతే
జోభాస్వంతము, స్వప్రకాశములసచ్ఛోభాయమానంబు నా
నాభద్రాత్మకతత్త్వ మోయుత దిదృక్షామాత్రసభ్యాళికిన్.

సీ. సారస్వతశరీరధాతులై యమరుచా
నన్నపార్యాదులఁ గన్న తల్లి
కార్యఖడ్గవిత్వ ఘనులు తిక్కనప్రియో
దారవీరులఁ గన్న వీరమాత
ప్రాగ్వాశిగిరులకు కేదస్థానమా పూర్వ
జలరాశి పెనుప్రాపు గలుగువసుధ
గౌతమీ కృష్ణవేణీ తటీక్షేత్రగ
[illegible] రుచి శ్రీ [illegible] గర్భ
దళితరిపుజాత మహితగోత్రసమాపేత
ప్రజ ప్రబోధింప పూతప్రజ్ఞాత్రగీత

మతిముదంబునఁ బాడెదు నాంధ్రమాత
నిఖిలసంపత్సమేతయై నెగడుగాత.

సూత్ర—(నాంద్యంతమున నంజలిపట్టి) దేశాభిమానులగు సభాసదులారా!

చ. కలుముల వేల్పు, పాల్కడలి గాదిలిపట్టికి పుట్టినిల్లు, ఆ
పొలఁతి ముగంపు వెన్నునకు బొడ్డునమానిక, మా సతీపతుల్
చెలువుగఁ గన్న చిన్నిసుతు సింగిణికోల బుధానుకూలమై
యలరెడు తమ్మిపూల, కుసుమాంజలి దీర్చి బరిగ్రహింపుఁడీ

ఆర్యవర్యులారా! నేఁడు ప్రయోగింపనెంచిన కథావస్తుతత్వము మనభారతవర్ష చారిత్రమున కెల్ల నమూల్యాలంకార సదృశము. ఏతత్కథా నాయకాగ్రణి భారతసార్వభౌమమాలలో మేరుమణిగాఁ జేర్కొనందగు చిత్తూరుమహారాణాయగు రాణాప్రతాపసింగు. అద్వితీయరాజనీతికోవిదుండగు నక్బరుపాదుషా యంతవాఁడు తన్ను సాధింపనెంచి చతురోపాయంబుల సహాయశక్తుల నెంతప్రయత్నించినను జితోస్మియనుమాట తననోటరానీయక యిరువది సంవత్సరములకుఁ బైఁగా నాటవికులమధ్య భార్యాపుత్రాదులతో పడరాని యిక్కట్టులకుం బాల్పడి తుట్టతుదకు మ్లేచ్ఛసార్వభౌముని మహాసైన్యమును తదాశ్రితులగు హిందూమహమ్మదీయ దండనాయకులను స్వకీయమహాబల మహాబలప్రసారంబున దూదిబుంగలవలెఁ బాఱఁదోలి శత్రువశములైన దుర్గములతో పాటు రాజధానియగు నుదయపురమును స్వాధీనముచేసికొని మేవాడ రాజ్యలక్ష్మికి మ్లేచ్ఛ సంపర్క కళంకము లేకుండఁజేసి రసపుత్ర ప్రతిష్ఠ పునరుద్ధారణముచేసిన మహానుభావుఁడు. ఏతన్నాటకరాజమునందలి నీతిరాజ మేమన,

ఉ. ఆపదలందు ధైర్యమె సుఖాస్పదమౌ; నిజకార్యసిద్ధి దీ
క్షాపరతన్ లభించునను సత్యము నిత్యము చాటి తెల్పగన్
రూపకరీతి వ్రాసె నలనో వెతగో దయఁ జిత్తగింపుఁడీ
చ్ఛాపురయజ్ఞనార్యులిల సత్కృతిఁ దత్కృతి మెచ్చుసత్కృతిన్.

సూత్ర—(తెరవంక జూచి) సరే! నేపథ్యమునందలి దృశ్యముగూడ శారదాగమవ్యాజంబున రాణాప్రతాపుని యుద్ధసన్నాహము నెఱింగించుచున్నది. ఇదే నాటక ముపక్రమింపం బడినట్లున్నది.

సీ. నిజవాహినీమనో నిష్ఠిప్తనియతిని
నిఖిలవాహినులలో నీరుతేలఁ
నిజబలోద్ధతి రిపునిజ మట్టులకు మహా
బలరయోద్ధతి ఘనప్రతతి చెనకఁ
గిరిశృంగములనుండి తెర తెరంబును భల్ల
భల్లంబులన చిత్రజల్లు గురియ
తనకీర్తిలతలు దిక్తటులఁ బూచెనొ నాఁగ
ముమ్మరమ్ముగ జల్లు పూలుపూయ
తటినెఱేఁగి నిచ్చె నివె శరద్వ్యాసరములు
ధైర్యనిధియైన రాణాప్రతాపసింగు
యవనకలభాశ్రియోరు దుర్గాళిఁ గొనఁగ
సమరసన్నాహములతోఁను సలుపనియన.

శేఁబోయి ప్రదర్శనము జయప్రదముగావించు ప్రయత్నములో నుండెద.

(నిష్క్రమించును.)]





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము

(చారిత్రిక నాటకము.)



## ప్రథమాంకము.

---

రంగము — కమల్మీరు మార్గ ప్రాంతమున నరణ్యము.

[చిత్తూరు రాణాయగు ప్రతాపుఁ డుచితపరివారముతోడను భార్యాపుత్రులతోడను నొకచెట్టునీడను విశ్రమించియుండును.]

ప్రతా — మిత్రమా! బాణభట్టారకా!

శా. ఆలంబంబను మహోన్నతంబటి ప్రతాపాఖ్య న్వహించెన్ ధీ
లీలన్ రసపుత్రరాజ్యము మేల్మేలంచుఁ జేర్గొన్న శౌ
ర్యాలంకారిణి నాదుతల్లి యల వీరాబాయి సత్కీర్తి శో
భాలాలిత్యముఁ బెంచి మాయిరము తీర్ప న్నేర్తునో నేరనో. 1

బాణభట్టు — స్వామీ! దేవరవారినోట నెన్నఁడు నెట్టియిక్కట్టులు వచ్చినప్పుడైనను వినలేనిమాటలువినవచ్చుచున్నవి. రాసినకొలఁదిని వాఁడిఁ దేరు శిశోదియాపౌరుషము పాసి యెన్నఁడైన మొక్కవోవునా!

అమర — బాణభట్టారకా నీమాట నిశ్చయము.

గీ. కులిశహాతి కొంతో భీతిల్లి కుధరపఙ్క్తి
యబ్ధిలోనను గహ్వాళి యందొ డాఁగ
వరశిశోదియా శౌర్యాగ్నిధర మొకండె
రగిలిరగిలి విజృంభించి పొగలఁజిమ్ము. 2

బాణ—సేబాష్. రాజప్రతాప! చక్కఁగాఁ జెప్పితివి. సింహవిక్రములగు నీయట్టికుమార వీరాగ్రేసరులు తనకడుపునఁ బొడముటచేత నేకదా మనచిత్తూరు నిశ్చయముగా వీరమాతయయినది. భ్రాతృద్రోహియగుసాగరకు వంచించుటచే నొక్కపరి పరాజయము వచ్చిన వచ్చుగాక.

ప్రతా—బాణకవిశిరోమణీ! దేశద్రోహియగు సాగరజి శత్రువుల నాశ్రయించెనని మే మధైర్యపడుచున్నామనుకొంటివా? అట్టివిచార మెన్నటికిలేదు. అట్టి పిరికి పందలు వందలకొలంది యున్నను నిష్ప్రయోజనము. పుప్పిపంటివలన నొప్పియే కదా మిగులు.

[అంత ప్రతాపపుత్రియగు కమల యేడ్చుచువచ్చి తల్లిని గౌఁగిలించుకొనును.]

కమల—ఆ! ఆ! ఆ! అమ్మాజీ! (ఏడ్చుచుఁ దల్లిని కౌఁగిలించుకొనును.)

అందఱు—(ఆత్రముతో) ఓడ్డా! ఏమిసంభవించినది. భయములేదు చెప్పుము.

అమర—చెల్లీ కమలా! ఏడ్పుమాని సంగతిచెప్పుము.

కరుణా—కుమారీ! భయములేదు. ఇదిగో! బాబాజీగారును అన్నయ్యయును సమక్షమునసే యున్నారు. భయకారణమేమి? ఏడ్పుమాని చప్పునచెప్పుము. ఏమమ్మా! మాటాడవు?

కమల—ఉదయము నాకిచ్చినరొట్టె కొంచెముతిని మిగిలిన దానిని చెట్టుతొఱ్ఱలో దాఁచుకొంటిని. కొండెపిల్లి యొకటి యెచ్చటనుండియో యతివలె వచ్చి దానిని తినివేసినది.

అమర—అయ్యో! కమలా! ఇందుకేనా యింతవంత. పోనీ నావంతునకు వచ్చినరొట్టె నీకిచ్చివేతునులే. (చేరఁదీసి) ఛే! ఛే! ఇంతమాత్రమునకే యేడ్తురా?

ప్రతా—బాణభట్టారకా! మాయవస్థ చూచితివా?

గీ. ప్రతిభ చిత్తూరునకు మహారాజు నేను
రాణి సుకుమారి రహతూరు రాట్కుమారి
బిడ్డ లాకఁటికొకరొట్టె పెట్టలేక
పంచి యిడుచుంటి మహాహా! మా బ్రతుకిఁ కేల? 3

ఆహా! కాలవైపరీత్యము! నిజమునకు మాయట్టి నిరుపేద లెందైన నుందురా?

చ. నిలువఁగ నీడలేదు కడు నెమ్మదిగా క్షణమాత్ర మేనియున్
కుడువఁగ కూడు లేదకట కట్టిలకేనియుఁ బొట్టనిండఁగా!

తొడుగఁగ గుడ్డలేకఁగద త్రొయ్యలి కేనియు మేనునిండ! ఈ
ఫలమిడ బ్రహ్మకెంతఁ గవారమొ, మ్లేచ్ఛులదెంత యూపులో!

కరుణా—ఓ ప్రాణేశ్వరా! దేవరవారే అట్లుతలంచుట భావ్యమా? మాకు మీరే సర్వైశ్వర్యములు. దేవరవారి సన్నిధానమే పెన్నిధానమని మే ముప్పొంగుచుండ తమరిట్టి వెలితిమాటలాడి నన్ను కలత వెట్టెదరా?

శా. లో పెద్దానను లేదు; మీయశమె చాలు న్నాకు; కామ్యప్రదం
బౌట న్మిందగు సన్నిధానమదె మాకుఁ బెన్నిధానంబు; ఆ
కోటల్ పేటలు శాశ్వతంబులె! యశః కోటీరమే నిత్యమౌ
కోటీరంబది యబ్బునేయఁటికిం గోటానుకోట్లుండినన్. ౫

ప్రతా—దేవీ! నీ వెంత బేలవు! నీవి కృతయుగమునాటిమాటలు. ఈ కలికాలములో కీర్తి యెవ్వరికి గావలయును? చూడుము! అంబరపురాధీశ్వరుఁడగు మానసింహుఁడు—

కరుణా—హృదయేశ్వరా! ఆకులపాంసనుని పేరెత్తకుఁడు.

గీ. కోటికి పడగెత్తియుఁ గీర్తిఁ గొనఁడొకండు
కాసు లేకున్న ధన్యతఁ గను నొకండు
దార నమ్మియు నూలకు దాసుఁడయ్యె
జగతి నుతిగాంచెఁడే హరిశ్చంద్రవిభుఁడు. 6

ఇసీ! నశ్వరంబగు నీ పాంచభౌతిక కాయమును బెంచునట్టిదియా నిజమైనధనము? పారలౌకిక సౌఖ్యంధనము. శాశ్వతకీర్తి కాయమును బెంచుమానధనమే వాస్తవమైన ధనము సర్వసౌఖ్యసాధనమగుంగాక. అది యటుండ నాథా! మీరు పేదలెట్లయితిరి?

గీ. ఒడ్డలను మ్లేచ్ఛులకు నమ్మి పేదవడిరె?
లేక తురకకుఁ దలనమ్మి లేమిపడిరె?
మానధనులరు మీకు సమానులేరి?
ధనికులందెల్ల మీరలే ధనికులుసుఁడి. 7

ప్రతా—దేవీ! నిజము. నిజము. (తనలో) అక్కటా! నేనెంత మందుండను. ఇటు లధైర్యపడి వీరిని మఱింత బెగ్గడిలఁజేయుచున్నాను. ఎంత పొరపాటు! లేని నిబ్బరముతోనైనఁ దెచ్చుకొని యీ బంధుమిత్రులనోదార్పకున్న ప్రమాదము సంభ

వింపదా? (ప్రకాశముగా,) మిత్రమా భాణభట్టారకా! ఏదో మాటవరుస కంటిని గాని రాజ్యసుఖములు మాకింతకన్న వాంఛనీయములు కావు సుమా! నిశ్చయముగా స్వభావనిర్మలమగు నీయారావళీదుర్గమునందు వసించు నిప్పుడు గలుగు నానందములో శతాంశమైనను మాకు చిత్తూరు దుర్గమునందుండదు. ఎందు కందువా?

సీ. వంశనిర్మాత బప్పారావళుఁ బుట్టి
నిన్నమాజనయిత్రి చన్నవఱకు
ధీరశిశోదియా వీరులు చూపిన
మహితప్రతాపంబు మఱఁచిమియును
అసహాయశూరుఁడై యందొక్కఁడొక్కఁడె నె
గ్గించిన సాహసకృత్యములును
దైవలోపమునఁ దత్కార్యభంగంబునఁ
బ్రాప్తించిన విపత్పరంపరయును
గీ. ప్రతిబిలంబును శిలయు నిష్పర్వతముల
క్షణముక్షణమిచ్చు బల్ ప్రతిధ్వనులు వినఁగ
నొడలు కంపించు లోనెత్తురుడుకఁదొడఁగు
కంట నీర్గారు సౌఖ్యేచ్ఛ కరఁగిపోవు. 8

భాణ—ప్రభుచంద్రమా! ఆపారపౌరుష్య మట్టిదే. ముఖప్రీతికిఁ గాదుగాని నిశ్చయముగా నీవిపచ్ఛోధనపరంపరలే దేవరవారి యప్రతిమాన పౌరుషవృద్ధికి కారణభూతములు.

సీ. రాపిడిసానపై రాపాడుపైఁగదా
వజ్రంబు నిజకాంతి బయలుపడుట
తతవహ్నికీలల తప్తమౌ పైఁగదా
స్వర్ణంబు వర్ణాతిశయముఁ గనుట
పటుమేఘపటలిపై బారినపైఁగదా
దినకరు తేజంబు ద్విగుణమగుట

తోలుకరిమలికంబు మలిచి పైఁగదా
నీలమేఘము వింత డాలుగొనుట

గీ. విధి విధించిన యీ విపద్విధి త్వదీయ
హృదయకుధరాంతరస్థమై పొదలుకొనిగి
అవరుబెడరేది యదనుకై యెదురుచూచు
త్వత్ప్రతాపాగ్ని ప్రజ్వలింపఁగ నెసుమ్ము.

[అంత సాళుంబ్రాధీశ్వరుండగు జయసింహుఁడు ప్రవేశించును.]

జయ—

ఉ. ఎన్నఁడుఁడా "జితోఽస్మి" యనుమాట మొఱుంగఁడు శౌర్యలక్ష్మికిన్
వెన్నిడఁబూంది జేఁడు కను వీరుఁడు, సూర్జనసాలు, మానసిం
గన్నవలంబడేఁ, గొలిచె నక్బరు, మ్లేచ్ఛులఁజేరినాఁడు కే
మున్నది పౌరుషంబుగల యోధులకున్ రసపుత్రసీమలన్. 10

బాణ—జయసింహకుమారా! నీవిప్పుడు చెప్పినది బందెలఖందు సూర్జనసాలుమాట యేనా?

జయ—ఔను నా శూరమ్మన్యుఁడే. అంతయు మానసింహుని దుర్మంత్రము.

అమర—ఏమేమి సూర్జనసాలే దేశద్రోహియయ్యెనా?

గీ. 'మానధనుఁడను, దేశాభిమాన మనిన
నింటిలోమాకు నగ్గున్నొనిడినదె' యను
శౌర్యనిధిగాఁడె సూర్జనసా లనంగ!
తుదకు మ్లేచ్ఛుల జేరెనే తుచ్ఛబుద్ధి. 11

బాణ—ఆర్యా! మనయుద్యమమున కిదికొంత యుత్సాహభంగమే కావచ్చును.

ప్రతా—ఓయి వెఱ్ఱివాఁడా! బాణభట్టారకా! మనమహోద్యమ మొక్కనితలమీఁదిదా యేమి? నాటి కురుక్షేత్ర సంగ్రామావసరంబున వీరశయనము నొందిన పవిత్ర క్షత్రియ రుధిరప్రక్షాళితంబులగు, ఈరసప్రతిక్షేత్రంబుల నొక్కరసప్రతి కుమారుండ మాత్రమేమిగిలియుండుంగాక! తుచ్ఛబుద్ధులగు మనవిపత్తు మ్లేచ్ఛులకు స్వేచ్ఛయను సౌఖ్యంబు సంఘటిల్లునుసుమా! వానిబుద్ధి పెడతలంబట్టి యా

నూర్జనసాలు తురకలసాళ్ళియుంచిన సాళ్ళియుంపుగాక, ఇంతమాత్రమున మన కేమిలోటంత ?

ఉ. పోవఁగఁబోవనిమ్ము! చెడిపోయినదేమి ? ఒకండువోయినం
జేవ నశించె నేమనకు, 'జేజయకాళి' యటంచు న్యాజిలో
జీవము లుండుదాఁక రణసీమను కాలు కదల్పకుండి చా
వో విజయంబొ చూరకను పూనుచు మీమనఁ కాంచుండఁగన్. 12

కుమారా! జయసింహా! బాల్యచాపల్యబుద్ధి గర్జితునని మే మిదివఱకే యనుకొంటిమి. చిత్తూరు కొత్తవార్తలేమి ? తక్షణమే వలసపోవలసినదిగాఁ గాగ లందఱికిఁ గచ్చితముగా నుత్తరువుచేసి వచ్చితివిగదా !

జయ—చిత్తము. మొన్నటి గొల్లనిపాటు మొదలినాటినుండియు నూరిపౌరిమేరల నుండు వ్యవసాయదారులుగూడ తమంతనే మారగాక్రమములను పాఱిపోవుచున్నారు. ఇఁక చిత్తూరువార్తలకేమున్నది! సాగరసింహ పట్టముగట్టు నిశ్చయమైనది. మానసింహుఁడు స్వయముగావచ్చి పట్టాభిషేకము చేయునఁట.

ప్రతా—సంతోషమే!

బాణ—ఏమీ! సాగరసింహమహారాణావారిదా యిఁకమీఁద చిత్తూరుమహారణ్యపురాధిపత్యము ?

ప్రతా—మహారణ్యమైనమేలు, పరేతపురాధిపత్యమనుఁడు.

సీ. బ్రహ్మరక్షస్సులు స్వస్తివాచకులుగా
నక్కకూఁతలు తూర్యవాదములుగ
రాబందుపులుఁగులు రాజబంధువులుగా
కాకిగూబలు వందిగణముగాఁగ
జిల్లేళ్ళ సేసలు జల్లుకొమ్మలుగాఁగ
బ్రహ్మదండులు బరాబరులుగాఁగ
కొఱవిబూషలు పల్లకుల వాహకులుగాఁగ
బైసాదమంట నివ్వాళిగాఁగ

గీ. మనుఁజుడనువాఁడొకండు పేరునకు లేక
వల్లకాఁడైన చిత్తూరు పట్టముఁ దల

కట్టుకొమ్మను సాగరాగ్రణిని నేఁడు
మానసింగన్న మదిఁగోని మమతదీఱ 13

అమర—మిత్రమా జయసింహా! సాగరజీపై మానసింహున కంత యాగ్రహము పుట్టుటకుఁ గారణమేమై యుండును.

జయ—ఏమో దానియాథార్థ్యము నాకుఁ దెలియదు గాని లోకులిట్లనుకొనుచున్నారు.

ప్రతా—ఎట్లు ?

జయ—కలదుగదా సాగరజీకి ప్రథమకళత్రమువలన గలిగిన పుత్రి మోహినీబాయి. రత్నపురాధీశ్వరుఁడగు రణమల్లుని దౌహిత్రి, సంప్రాప్తయౌవన. ఆమెను మొగలాయీజనానాకు డోలాగాఁబంపునట్లు సాగరజీతో మానసింహుఁ డేర్పాటుఁ జేసి తత్ప్రతిఫలముగా చిత్తూరుసింహాసన మీయ నుద్యుక్తు—

ప్రతా—హా! ఎంతదారుణ మెంతఘోరము! ఇదికలకు మా శిశోదియావంశమున కిట్టి మచ్చ వచ్చియుండలేదు. హా! మానసింహా! దురభిమానసింహా! నాఁడు నీకు పంక్తిభోజనమీయని కార్పణ్యము నేఁ డిట్లా సాధింపంజూచితివి ! ఓరీ! అపాంక్తేయుఁడా! మ్లేచ్ఛదాసా! ఇంతమాత్రమున నీసంకల్పము సిద్ధింపనా? ఓరోరి దేశద్రోహీ! రసపుత్రవంశపాంసనా!

చ. పురుషుఁడవై కులంబు చెడఁబుట్టితి వేర! స్త్రీవు వైన ముం
గరనిడి గాజులందొడిగి గన్యపుటంతిపురంబుఁ జేర్పమే
తురకలమీఁదిమోహమున దూకితొ పాకితొ పోదుగాక, యా
కొలఁదిదోలంగు నీతనుపుకూలిన, ఇంతలు చేసియుందువే. 14

అమర—ఓరి చండాలుఁడా, మానసింహా! నాఁడు కమలమీయరుమార్గమున మేముండగా నీవు వచ్చినపుడు మాశాబాజీగారు—

గీ. స్వాగతంబీయఁ దారె రారనుమ నలిగి
క్షత్రి భుజియింపలేదని పగ మనఁగొని
అనికి మేల్లుఁ దోడితె మ్మనుట కుడికి
గుండెలో మంట సిటులార్పుకొనఁ దలఁచితె. 15

ఔరా! ఇంతమాత్రమున నీకడుపుబ్బు తీరునా! ఏమో వెఱ్ఱిగా నాలోచించితినిగాని మాశిశోదియావంశమును కెలుపుటకు నీప్రపితామహులు దిగిరావలయును సుమా !

పుట్టిననాటనుండియు మాతామహుని సంరక్షణలోనుండుట మోహిని నాయికకు దెట్టి స్వాస్థ్యమును సాగరజీకిలేదు. అది యటుండ నో కుటిలబుద్ధీ!

క. చిత్తూరురాజ్యలాంఛను
నుత్తమభూజనస్తుతుఁ డొక శాఖికుఁ డేనే
గత్తిగొనిదివ్వ నీదగు
నెత్తులు జిత్తులును సాగునే! ఛీ! కుమతీ! 16

కరుణా—అక్కటా! అనుశ్చరితుని కార్పణ్య మెంతటిదారుణములను జేయించుచున్నది.

క. ఆకూళ తాను చెనుటయె
కాక శిశోదియకులంపు గౌరవమెల్లన్
బోకార్పనెంచె నిష్ఠురు
శోకంగోల్పడిన నక్కటా శోకమునఁ గటా. 17

ప్రతా—అదియేమి! జయసింహా! నీచేతిలో నేదియో యుత్తరమువలె నున్నది.

జయ—ప్రభుచంద్రమా! నే చిత్తూరునుండి రత్నపురిమీఁదుగా వచ్చుచుండ నొక శిబిముఖముఖంబునుండి యీలేఖయుఁ గంకణంబును నాకుం దొరకినవి. ఉత్తరముపై దేవరవారివిలాసముండుటచే నుత్తలపడి దీనిం గొని తెచ్చితి.

ప్రతా—ఏదీ! చదువుము.

జయ—సీ. శ్రీమన్మహారాజ! క్షితిజనానురభూజ!
భూజనస్తుత ప్రతాపభూతలేంద్ర!

ప్రతా—బిరుదులమాటకేమి? సారాంశమును జదువుము.

జయ—చిత్తము.

జామాతయే గర్భశత్రువై రాజ్యంబు
గాంతుకుఁ గుటిలుఁ గూర్పనెంచె
కోటచుట్టు నరాతికోటి కావలియుంచె
మానసింహునితోడ మదిఁ దలంచి
నమ్మినబిడ్డయు నా రాజ్యమునుబోవు
న్నొంటరి ననదనై యుంటినిచట

అర్థంబును మానము మాకిచ్చి ప్రాణమ్మొసంగె
పుక్కిటంబట్టియుంటి నన్నొక్కనాఁడు
కాంచి విషమం దలంచి, సుఖంబొకపరి
కనఁదలఁచితే వేవేగ కదలిరమ్ము. 18

ఇట్లు విధేయసామంతుఁడు,
రత్నపురీరణమల్లుఁడు.

ప్రతా—హా! బంధుద్రోహీ! సాగరా! చిత్తూరువంశవనధిహాలాహలా! ఎంతపనిచేసితివిరా ఓరి కుక్షింభరా! నీకు రాజ్యము కావలసిన నేనే సంతోషపూర్వకముగా నిచ్చివేసియుందునే. హా! హా! హా! (మూర్ఛిల్లును.)

చాణ—తల్లీ! శీతలోదకము. ప్రభువువారు మూర్ఛపోయినట్లున్నారు.

కరుణా—(శైత్యోపచారములు చేయును.)

ప్రతా—(ఉపచారానంతరము లేచి)

శా. ఏదీ నైజము వృషోయిత్పంతుండె మాహీపాత్మజ్ఞ; తద్భ్రాతసమం
త్రో దుష్టంబది కాకీగద్దెకు భర్తుర్ పెట్టెదన్ వంశము
ర్యాదన్ సిగ్గిడి బుగ్గిఁగల్పి యిఁక రాజ్యాబ్ధేనే ద్రోహి రా
నీ దిక్కెక్కడ యల మానసింగొ మతీ ఢిల్లీసిగ్గుఁదో మాచెదన్. 19

పోనీ సోదరుఁడుగదా యని కనికరించినకొలఁది కులభ్రష్టున కెంతస్వాతంత్ర్యము ముదురుచున్నది. ఇదే! వాని హతమార్చెదను. (లేవఁబోయి చతికిలఁబడి) ఆ! ఇదియేమి?

కరుణా—ప్రాణేశ్వరా! శాంతింపుఁడు. ప్రస్తుతము తమ శరీరములో స్వస్థతగా నున్నట్లు లేదు.

ప్రతా—జయసింహా! నీ వున్నపాటున నేపోయి—

శా. మీఁదెట్లైననుగాని, రాజ్యము భస్మీభూతమై పోవనీ
కాదేనిన్ సుతప్రాణమైనఁ జననీ, కంఠంబులో జీవమే
లేదోయిద్దఱు వారికిన్ బోరి సతికిన్ మ్లేచ్ఛత్వముం బాపి మ
ర్యాదన్నిల్వఁగఁ బెట్టుమయ్య జయసింహా! సింహదోర్విక్రమా! 20

కరుణా—జయసింహకుమారా! మహారాణావారిపల్కులు వినుచుంటివిగదా!

ఉ. నైచె నితంబు సంపదలు సర్వసుఖంబులఁ బోయిన, కొండకోనలం
దే చరియించి కాయకసరే దిననైచె, కుటుంబముక్తుఁడై
నీచులయుక్ష్య కొండగవిని వాసముంపఁగనైచె, నెట్టులా
గా చెడఁబో, కనంత కుఁటారకతంత్రానికి నైపఁడెప్పుడున్. 21

ఇది మదినుంచుకొని రయమ్మున పొమ్ము. సఫలమనోరథుండవై చనుదెమ్ము.

జయ—దేవీ! మహాప్రసాదము.

ప్రతా—కవిశిరోమణీ బాణభట్టారకా! మన కీకన్యారుణి మానరక్షణము చిత్తూరు కోటకన్న మిన్న కావున మీరు ఢిల్లీకిఁబోయి మాకాక పృథ్వీరాజుంజూచి ప్రచ్ఛన్నవృత్తిని కార్యము మించకుండునట్లు చూచుచుండవలయును. పృథ్వీరాయనితో తీరిక గలదేని మే మొకసారి రమ్మంటిమని చెప్పుఁడు.

బాణ—చిత్తము. సెలవు. (అందఱు నిష్క్రమింప తెరజారును.)

2. రంగము—మానసింహుని యభ్యంతరమందిరము.

మాన—(ఆలోచించుచు విశ్రమించియుండును.) అహహా! రాజనీతియఁట! నీతిరాజమఁట! నేతిబీరకాయలోని నేతిరీతిని రాజనీతిలోని నీతిరాజము రూపక్రియాభావంబయి కేవలనామమాత్రవశిష్టంబయి పరమేష్ఠివిధంబున నధిష్ఠితంబయి యుండు. ఇందలి యాథార్థ్యము ప్రభుచిత్తమునుబట్టి దేశకాలపాత్రోచితంబుగా సమర్థింపఁబడుచుండును. ఇయ్యది శిష్టమో, దుష్టమో, మాన్యమో, హైన్యమో, వంద్యమో, నింద్యమో, యిదమిత్థమని నిర్ధారణచేసి చెప్పుట కిప్పటి మనీషావిశేషజ్ఞులకు ప్రాజ్ఞత చాలదు.

మ. పవిధారోగ్రకఠోరమై నవసుధాప్రక్షాళితాంభోజ మా
ర్దవమై దుర్దమ నిర్దయోద్ధతగుణప్రాగల్భ్యమై సత్కృపా
ర్ద్రవినమ్రామల భావపూర్ణతమమై ప్రాచుర్యమై గోప్యమై
యవనిన్వర్తిలు రాజనీతిగతి సత్యాసత్యసంయుక్తమై. 23

ఇది యెఱింగియేకదా మర్త్యలోకవాచస్పతియని చెప్పనొప్పు భర్తృహరి తన సుభాషితముల రాజనీతిని వారకాంతకు సరిపోల్చెను. ఔనౌను. అర్థసంగ్రహావసరంబున నుచ్చనీచపద విచక్షణ మావంతయు లేక, స్వకార్యసంసిద్ధికై జాతినీతుల ననులోమవిలోమంబుల వాసి వీసమంతేని పాటింపక యొక్కచో బుద్ధునిన్మఱపించు భూతదయయు, ఇం

కొకయెడ కసాయివానింగీసిపోని కాఠిన్యతయును, ఒకదెస శిబికర్ణదధీచులం దృణీకరింపఁజాలు త్యాగశీలతయు, నొండొకదండ మలభక్షకుండగు లుబ్ధాగ్రేసరచక్రవర్తిన్మఱపింపఁజాలు పిసినిగొట్టుతనమునుం గలిగి సమయానువర్తనప్రవర్తిని యగు రాజనీతి వేశ్యకాంత కాదు వేశ్యమాతయే యేలకాకుండును. ఇంతయేల ? ఈపరమరహస్యము తనబాహ్యాంతరచారిత్రముల నాదర్శప్రాయముగాఁ జూచుకొనుచుండుటచేత నేగదా మా యక్బరుచక్రవర్తి పులిపందివారడికైనడి జాతిమతవైమనస్యములం బెట్టుకొని యొండొరులంగనివంతనే భగ్గునమండిపడుచుండు యవనహిందూజనమాన్య సామాన్యులం దనన్యసామాన్యసౌజన్యము నందఁజాలి, ఆసేతుశీతాచల మహామహీతలంబు నెల్ల నేకచ్ఛత్రాధిపత్యంబుగా నేలి యిరుదెఱంగులవారి నొక్కదారి నడపించుచున్న వాఁడు. ఆహా లౌక్యుఁడన నక్బరే పరమలౌక్యుఁడు. రాజనీతియన నాతనిదే రాజనీతి!

అట్టి యాతనివిఖ్యాతరాజనీతి కతీతంబగు నీతిరాజంబును చతుర్విధోపాయములఁ బ్రయోగించి దేశమాతయైన దాఱుశతాబ్దములనుండి గోల్పోయిన స్వాతంత్ర్యమహాభాగ్యమును ఆర్యావర్తములోఁ బునరుద్ధారణము చేయుటకై తదీయరాష్ట్రాధిపతులఁ బ్రబోధించి శక్తివంతులం జేయ సమకట్టిరే గదా హిందూమహమ్మదీయ సమ్మేళనమున కాదిని మాతండ్రిగారగు భగవాన్దాసుగారేమి ప్రస్తుతము మేమేమి శక్తివంచనలేక ప్రయత్నింపుచున్నారము. మా రసపుత్రులలోఁ గొందఱు ముఖ్యముగా మేవారువా రీమా సంకల్పమర్మముం గ్రహింపఁజాలక మా మనోగతప్రీతులకు విపరీతవ్యాఖ్యాతలై మేమేమో వర్ణసంకరము చేయఁ గంకణము గట్టుకొన్నార మనియు, పతివ్రతాధర్మంబున సనాతనప్రఖ్యాతిగాంచిన రాజపుత్రసతీమణుల సతీత్వము మంటఁగలుపు చున్నార మనియు గంతశోషగాఁ బలుకుచున్నారు. చేతఁగాని ప్రతాపుని రీతిని సతీ సుతాదులతోఁ గొండకోనలంబట్టి కూఁడుగుడ్డలకు మోమువాఁచి మానమో మానమో యని కోఁతి పిడికిలిని బట్టిన నణుమాత్రమైన లాభ మున్నదా!

ఇప్పుడాతని తమ్ముఁడే తనకూఁతు మొగలాయీ జనానాకు డోలాగాఁబంప సంసిద్ధుఁడైయున్నాఁడే. తానేమిచేయఁజాలెను! సాగరజీ తనతమ్ముఁడుగాఁడా, మొహినీబాయి తనవంశమునఁ బుట్టలేదా!

మ. అవివేకంబున నగ్నిపత్నీ తనుడాయన్వచ్చు నవ్వారిక
ర్గవ మూయున్మదిలోఁ దలంచి యినుకం గంఠంబుఁజొప్పించి త
న్నెవరుం జూడఁగ లేదటంచు నెదహాయింబొందుచుండానఁ దా
ను వసించేరె సరే! కులంపు మశ మన్యుం జెందనీ కాఁపెనే. 24

వాఁడు ప్రతాపరుద్రదేవరాయలు! మాంధాతృకులమునఁ బుట్టిన శివాజీయు నన్య మతిసంపన్నుఁడును నేనెన్నఁడును. నా శత్రుఁడే సుగుణుఁడో! చేతనాని ప్రశంసలు! అఖిల భారతీయ మహాసామ్రాజ్య స్థాపనమునకు నత్యుత్తమమైన యంత్రవానిని చిత్రము వచ్చినట్లు కీలుబొమ్మనలె నాడింపఁజాలు మానసింహునితోడనా పంతముపట్టి యొంచు కొనుట! ఎట్లయిన మోహినీబాయి నిప్పటికి రప్పించితినా ప్రతాపునివంశప్రతిష్ఠ నామమాత్రావశిష్టముగఁ జేసి నలిపివేసినవాఁడనే! సలీముం గులాముం గావించిన వాఁడనే! మదీయభాగినేయుండగు కుసుమానుఁ భారతవర్ష మహాసామ్రాజ్య పట్టభద్రుం జేసి భవిష్యద్రాజ్యతంత్రబంధము నస్మదీయహస్తగతంబు గావించుకొనినవాఁడనే. ఇప్పుడామాటలెందుకు! తనచాకచక్యముచే సాగరజీని వలలోవైచుకొనుటకై పంప బడిన భూలోకాప్సరస చంద్రికళ యింకను రాలేదు.

[అంత సేవకుఁడు ప్రవేశించును.]

సేవ—మహారాజా! ఉదయపురమునుండి చంద్రికళ డోలావచ్చినది.

మాన—సరే! రావచ్చును.

సేవ—చిత్తము.

చంద్రి—అంబరపురాధీశ్వరా జోహారు! జోహారు!

మాన—ఓహో! చంద్రికళ! ఉదయపురమునుండియేనా రాక?

చంద్రి—చిత్తము.

మాన—ఏమయ్యెను? సాగరజీ నెంతవఱకుఁ దెచ్చితివి?

చంద్రి—సాగరజీ నాకు దాసుఁడయ్యెను.

మాన—ఎట్లు?

చంద్రి—గాంధర్వమున.

మాన—ఏమీ! నీ గాంధర్వవిద్యామహిమచేతనా?

చంద్రి—మదీయ గాంధర్వవిద్యాదాసుఁడై గాంధర్వవిధిని నన్నుం బెండ్లికూడ నున్నాడు.

మాన—ఏఁడీ! ఆతఁడెక్కడ?

చంద్రి—ఎక్కడనుండును! నన్ను విడిచి యొకనిమిషమైన నుండఁగలఁడా? నాతోడ నే వచ్చెను.

మాన—సెబాస్ చంద్రికళా! నీవెంత నెఱజాణవే! మోహినిసంగతి?

చంద్రి—మోహిని రేపటి నెల్లుటి మొగలాయీ జనానాకు డోలాగాఁ బంపఁబడును. రత్నపూరు ముట్టడి జరుగుచున్నదిగదా! తమరు నటువైపు దయచేయుచున్నా రని వింటిని.

మాన—ఏమో! ఆసంగతి నేటిదర్బారులోఁగాని తేలదు.

సేవ—(ప్రవేశించి) మహాప్రభూ! దర్బారునకు దయచేయవలె పాదిసావారి సెలవు.

చంద్రి—నే నిఁక సెలవుతీసికొనవచ్చు ననుకొందును.

మాన—సరే! సాయంకాలము సావకాశముగాఁ గూర్చుందము. నీసంగీతము విననాకును చెవులూరుచుండును.

చంద్రి—(తనలో) ఈదిక్కుమాలినపాట నాకెక్కడ వచ్చినదో గాని అహోరాత్రము లరవైగడియలు నాకు సంగీతసభలకే చాలకున్నవి. రాజధానిలో కాలు పెట్టితినో లేదో గులామువేత సలీంరాట్కుమారుని వర్తమానము. పోతే మానభంగము! పోకుంటే ప్రాణభంగము! (పైకి) ఇప్పుడు దర్బారునకు నేను రాకతీరదుకదా!

మాన—అన్నట్టు నీవు సలీంరాకుమారుని యొద్దకుఁ బోయినప్పుడు మోహినీవ్యామోహ దోహదము వరాకుపడకు.

చంద్రి—అదిగో! చూచితిగా మతి? ప్రస్తుతము రాజకార్యములయందు గెలుపుకూడ ప్రబలులగు పురుషుల భుజబల బుద్ధిబలముల కసాధ్యమై మాబోఁటి యబలల మీఁదనే పడుచున్నది.

మాన—చంద్రికళా! నీ వబలవా. ప్రబలులగు పూరుషుల వేయిమందిని జాపి పుట్టితివి

సీ॥ సంగీతరస మింత చవిచూపినం గాలి
పట్టి పండ్లిగిలించి భ్రాంతిపడును.
అభినయకళ నొక్క హస్తంబుపట్ట వి
ఘ్నేశుఁడైనను పెండ్లి కాశపడును
సరసప్రసంగవైఖరి కింత దొరకొన్న
శుకుఁ డే యు వ్రతంబు జాఱఁబుచ్చు
మెఱుపుఁదీఁగంబోలు మేనిహొయల్ చూప
భీష్ముఁడేని యనంగపీడితుఁడగు

గీ. చక్రిచక్రంబు వజ్రివజ్రముఁ బినాక
పాణిశూలంబు కన్నను వాఁడిగాదె
చేఁడె నీయోరచూపను వాఁడితూఁపు
విటుల ధృతిఁజీల్చు నన్నచో వింత యేమి! 25

చంద్రి—సరే! ఇట్లే నన్నుబ్బించి చేయవలసిన పనులు చేయించుకొను చుండుఁడు. నేనింక సెలవుపుచ్చుకొందును.

(నిష్క్రమింపఁగాఁ దెరజాఱును.)





శ్రీ

# 'రాజపుత్ర తేజఃపుంజము'

## ద్వితీయాంకము.

రంగము—కోటలోనుండి పాదుషా దర్బారుభవనమునకుఁ

బోవు ప్రత్యేకమార్గము.

[గులాం హుక్కా సెమ్మాయును, సలీం సారాసీసాయును

బట్టుకొని ప్రవేశింతురు.]

సలీం—అరే! గులాం! ఇద్దూచంద్రికళా సెప్పిన డోలామోహినీబాయ్ అంత అంద వుందీరా?

గులాం—ఆ! అచ్ఛా! బలేలాయిక్నేవుంది సర్కార్! మిహిరా ఉన్నీసాకి అంత హందం, సందం ఉందీ లేదూ అందర్ కొందర్ అంతార్.

సలీం—(బుడ్డివిసరికొట్టి) చుప్రావ్! చోడ్దేవ్! ఉన్నీసాకీ దీన్కి సమం చప్తావ్. మిహిరాకి సమం జహార్మే నహి. అందుకే దానికి మేమ్ నూర్జహాన్ ఖితాబ్ యిచ్చినామ్.

గులాం—జూటాబాత్ కాద్‌సర్కార్! సాంగర్జీ బేటీబహుత్ లాయక్నేవుంది. కందూ లేని చందూదాని మొహం చందర్కే గందమ్మే హుంది దోహం. హందమ్మే సందమ్మే యెందరైనా సుందర్కి నహీబోల్‌సక్తా సునో సర్కార్.

సలీం—అరేగులాం! అయితే అది అంత అందవుంది సప్తావ్! దానితో హావస్యం స్నేహం సెయ్యాల. ఇందుక్ మామాజీ రాజామాన్‌సింగుతో ఖాన్కీమే బందోబస్తుచేయ్యాల!

గులాం—అమ్మాజీ జోద్బాయి బీగమ్ కలఫ్ సేస్తే దరోబస్తు మణంలో అనుకూలం అయిపోతాదీ సర్కార్.

సలీం—సహీ! సహీ! అక్ల బడేతంటూవుంది. తుమ్నే సా కమామీష్ ఖుల్లాసీవా అయింది యింద్కా. నకీమాలుమ్?

గులాం—సహీసహీ సర్కార్ ! నాదివుంద్ది మక్లీ ముస్తా. తెల్వాను.

సలీం—(వీపుపైగుద్ది జారే! హైవాన్! నీకిబుద్ధియెక్డావుంది? (చెవిలో నేమోచెప్పి) మాలుమ్ హే!

గులాం—అచ్ఛా! సర్కార్! మాలుమ్. కల్లాఖాలీఅయిపోయి ఆలోచన్ బుద్ధీ అంతా ఏక్దం పైకీ వచ్చేసింది!

సలీం—హాహాహా గులాం జరూర్సే దారూఖానాకుజాన్. పరాంస దేశబిలాతీసర్కా-పక్కారకమ్ తాజా దారు వచ్చీవుంది విన్నామ్. తీన్ సీసా తీసుకురా! తూ కచ్చా కచ్చారకం మంచి నిషానేది లేదు.

గులాం—జీసర్కార్! తుమ్నా మాఫ్ కర్పోయి తొవ్వాదంతా పట్కావస్తామ్ మాకీ క్యా ఫర్వా?

జరూర్సే హంపాస్సే వెళ్లిపోతామ్
పరాంస్ దేశం సర్కా కట్కానస్తామ్
బరాబర్ షర్కార్కా నిషా సేస్తామ్
నోరోజా ఆనాకు నమాస్ సెస్తామ్॥

(గంతుచు పాడుచు పోయి తెచ్చి యిచ్చును.)

సలీం—(త్రాగి) ఆ! అచ్ఛానిషాఅవుతూవుండాది. అరే నుసార్కీ సా మాకీ ఫేక్మె పోయి.

గులాం—(వికారముగా పోయగా సలీంత్రాగును. గులాం మిగిలినది త్రాగును. గంతుచు పాడుచుందురు.)

పాట—పరాంస్ దేశం దారూషర్కా నిషా సేసి
బికార్ సీర్ కానాకి నికాల్ సేస్తామ్
నోరోజా వహాన్సే కార్వాయేమం యేసి
భేషూన్సే పోషక్ తమాషా సేస్తామ్
సలీంసర్కార్ జీకి ఖోలాసా సాయించి
తాజా జవహారీమే నజార్ కొట్టాం

జులుమ్ సే అలహాబాద్ కోటా లూటీ సేసి
హుజూర్ ఖజానా బజారీ పెట్టాం.

(తెరయెత్తఁబడును.)

దర్బారు.

[లోపల అక్బరుఫాదుషా మంత్రి సామంత పరివేష్టితుండై కొలువుదీర్చి యుండును. వంది మాగధ గాయన గాయకులు తమతమ పనులు నిర్వర్తించుచుందురు.]

అక్బరు—గాయన గాయనీశిరోమణులారా! మీమీ వినోదములింక విరమింపుఁడు. చంద్రికళా! అభినవంబగు నీయభినయ విద్యావైభవ మెంతయు నభినందనీయము. దర్బారుముగిసిన వెనుక పారితోషికమందఁగలవు. ఈలోపున కార్యాంతరము లున్న చక్కఁజేసికొనిరమ్ము. పొమ్ము.

చంద్రి—చిత్తము. ఫాదుషావారికి ఖుద్దుననొకయర్జీ దాఖలుచేసికొన వేచియున్నదాన.

అక్బ—ఏదీ! ఇటు తెమ్ము. (చూచి) సరే! నీకార్యములందప్రమత్తురాలవై మెలంగుము. నీకోరిక నెరవేఱఁగలదు. పొమ్ము.

చంద్రి—చిత్తము. దర్బారుముగియులోపల ఢిల్లీలోని పూర్వపరిచితములగు రాణివాసములకేగి యభ్యంతరమందిరంబులఁ బునర్దర్శనము చేసికొందును.

అక్బరు—మంచిది. (చంద్రికళ నిష్క్రమించును.)

అక్బ—మిత్రులారా! నేఁడు ప్రతాపునిచే పంపఁబడినదను సందేశము కడు సందేహాస్పదముగా నున్నది. అతుల ప్రతాపతేజఃపుంజమగు ప్రతాపుఁ డిప్పుడైన పశ్చాత్తాపతప్తుఁడయ్యెనని వినుట సంతోషమే కాని యీవర్తమాన మెంతవఱకు విశ్వాసపాత్రమైనదియో బుద్ధిమంతులగు మీరే యోచింపుఁడు.

మానసింగు—సార్వభౌమచంద్రా! నమ్మకుండుటెట్లు?

అక్బరు—ఎట్లా?

చ. ఇరువదిహాయనంబు లిటులేగె నితాంతపు టష్టకష్టముల్
దరికొన నొక్కనాఁడు నిటు దైన్యపుటుత్తర మంపియుండెనే
శరణను నే ప్రతాపుఁ డసిఁ జచ్చినఁ జచ్చునుగాక దీని నే
కరణిని నమ్మవచ్చు మతికాదను టెట్టులు దక్కుతుండఁగన్. 25

మాన—ఏమో! మానవజన్మముగదా! అందులో నాదినుండియు సుకుమారముగాఁ బెరిగిన ప్రాణి. ఇప్పుడు మానహానియని యెంతకాలము తమాసపముఁ జూపఁగలడు.

చ. గొనకులు హంతకులు వ్రతియుఁ బూనిక గుడ్డిం మోము వాని కా
ఱకపులనెంత కాలమును హైన్యము గొందఱుఁ జూచి మోమ్ముఁ లో
బడని మానవ బుధుఁ బంతము పట్టి నిల్చు నే సుఖం
పడ నెవఁగోరఁ జెప్పుడీ వానిని మిన్న స్వజన్మమే గదా. 26

పృథ్వీరాజు—ఆర్యా! మానసింహా! అసదృశసామాన్య శౌర్యప్రతాపతేజఃపుంజమగు ప్రతాపుని ప్రకృతికిని సామాన్యమనుష్య ప్రకృతికిని హస్తిమశకాంతరము.

మ. రిపుకోటిన్ స్తవనీయకీర్తిం దధిదోర్వీర్యప్రతాపోద్ధై
ర్యపరీతుండగుచా ప్రతాపుఁడన సర్వైశ్వర్యముల్ పోవనీ
త్రిపథోనాశి జితోన్నయుండు వరచే తాళంతుమోల స్వేచ్ఛనే
విపరీతం బిది యెట్టులొట్లు? రవి యున్నన్ వెన్నెలల్ గాయునే.

మాన—ఓహో! అంతటిమానధనులా మీబావగారు ప్రతాపసింహమహారాణావారు! ఇంతటి శూరమ్మన్య చక్రవర్తులు గావుననే కాంబోలు నిప్పుడు మహారణ్యములో బిడాలచక్రవర్తులయి తిరుగుచున్నారు. ఎందుకో యింకను మొండితనము.

గీ. విడిచె చిత్తూరు నుదయపురిం బ్రోడిచినాఁడు
కమలమియరను దుర్గంబు కడకు విడిచె
నిన్న నాహల్దిఘట్టున నన్ని విడిచె
విడువలేకుండె ప్రాణమే నెట్టియగుచు. 28

పృథ్వీ—మానసింహా! పరోక్షమున పరిహాసింపుటయే పౌరుషము.

మాన—ఇందు పరిహాసమేమున్నది? ఉన్నసంగతియే. చిత్తూరుకోటఁ గోల్పోలేదా, ఉదయపురముమాట ఉత్తదియా, హల్దిఘట్టున పలాయన మబద్ధమా; ఇంక నున్న కమల్మియరు నిన్న మే మాక్రమించుకొనలేదా?

పృథ్వీ—ఓహో! కమల్మియరు మీరుపట్టుకొన్న ముచ్చటయే మెచ్చవచ్చును.

ఉ. వక్రమతిన్ కమల్మియరు బావిని ద్రావెడి నీటిలో విషా
చిక్రిమిదోహదంబున తక్ష్వేళముఁ గల్పఁ దమంతపోయి రా
యక్రమమూ నుతింతు కృతివై నిజమెవ్వరెఱుంగనట్లు! ఛీ!
విక్రమమా భవాదృశులు పేరుకునున్ రజనీచరక్రియల్. 29

మాన—చాలుఁ లే! ఇట్టి కఱుకు ప్రబ్బుమాటలు దర్బారులో నమ్ముని నారెవ్వరును లేరు. ప్రతాపుని ప్రస్తుతస్థితి నెట్టి దున్న దో యాలోచించిన నీకంత యుకుకుఁ బోఁదువ మేల? నిజమునకు ప్రతాపుఁడే మానవంతుఁడేని యిట్టిస్థితిలో ప్రాణపరిత్యాగము చేసికొనియుండును.

పృథ్వి—ఓయీ! అతఁ డొక వేళ సద్యఃపాతియగు నీ భౌతిక దేహమును పరిత్యజించినను పరిత్యజించుఁ గాక. జగద్విఖ్యాతమగు నాతని కీర్తికాంత మాత్రము క్షుణ్ణక్షుణ్ణోజ్జ్వలమై శాశ్వతమై సజీవమై సకలదేశాభిమాని ప్రాతర్వందనీయమై అజరామరమై సమస్తచరాచర సమన్వితాసేతుశీతాచలమహీతలనాట్యరంగస్థలంబున నఖండతాండవమాడు మానము గాఁ దాండవమాడుచుండును సుమా! ఇఁక కేవల లోకాయతమతప్రవర్తకులమగు మనబోంట్ల మాటయే విచారణీయము.

మాన—ఓయీ! చుట్టిచీకముకతంబున నీ వాతని బట్టువలె పొగడుకొనవచ్చును మా యొక్క బుద్ధి తల కెక్కెనట్లు కేమీ పోతాత్రు?

పృథ్వి—ఇది యిన్ను నున్నమాటయే. అందుల కుకుకుఁబోఁదువ మేల?

అక్బరు—ఓ రసపుత్రవీరులారా! శాంతింపుఁడు. మానసింహుని మాటలో పొరపాటు లేదు. ప్రతాపుని ప్రస్తుతస్థితి యెట్టిదో యూహింపుఁడు.

మ. బలమ్మింక లేదు, ధనంబు సున్న, బలవద్వైరంబు సాధింపఁగాఁ
దలపోయుంగఁ బ్రతాపసింహునకుఁ జిత్తభ్రాంతి యీ యేమి? భి
ల్లుల మూఁకం గొని ఢిల్లినాయకు నెదుర్కొ నెంచు నా కుక్కతోఁ
క లలిఁ బట్టుచు గౌతమీనదికడంకం దాఁటఁగా నెంతురే. 30

అసహాయుండయిన ప్రతాపుఁ డెంత ధైర్యవంతుఁడైన నేమి ప్రయోజనము?

పృథ్వి—ప్రతాపుం డసహాయుం డెట్లగు? మొన్న టి హల్దిఘాట్ యుద్ధమున ప్రక్కలో బల్లెమునగా నుండిన జయమల్లుని పుత్రుండు జయసింహుఁడు మొదలగు సింహవిక్రము లెందఱో కలరు.

మాన—(కోపముతో) ఓహో! అట్లనా!

మ. జయసింహుం డొక వీరుఁడే యగును; తచ్ఛౌర్యాప్తిం గాంచి యీ
సయుఁ జెందదగు నా ప్రతాపుఁ, డిటు లచ్చోయించు వీరా గ్రేసరా;
జయమే గాని మఱొండెఱుంగ దిది, యస్మద్బాహుదండాసి మొ
ద్దయి పోలేదుగదా ప్రతాపుదెస నేలా వ్యర్థవాగ్జాలముల్?. 31

అక్బరు—రాజా మానసింగ్ జీ! మీయుపక్రమానపత్రతాపంబునకు దుస్సాధ్యం బొండు కలదా! ఈసామ్రాజ్యమునం దర్ధభాగాధికము భవద్బాహుబలసంపాదితమే కదా! * * * *

ఆర్యా! పృథ్వీరాయా! పత్రాపుని యుత్తరపు యథార్థోదంతంబులు దెలియఁ దమరొక్కపరి శ్రీమయనక కమల్మీరున్ దుర్గమునకుఁ బోవలయును.

పృథ్వీ—చిత్తము. పాదుషావారు నాకుఁ బదునైదు దినములు గడువు దయచేయించిన నాయుత్తరపు నిశ్చితి నివేదింపఁగలను.

అక్బరు—మంచిది! రాజామానసింగ్ జీ! రేపే మీరల రత్నపురంబునకు సలీంరాకుమారునితో సుచితబలసమన్వితులై పోవలయును. ఏడీ! సలీమెక్కడ?

అబుల్ ఫజల్—అదిగో యువరాజసింహాసనము నలంకరించి యున్నారు.

అక్బ—కుమారా!

సలీం—(పరధ్యానముగా నూరకుండును.)

అక్బ—(రిచ్చపోయి) అయ్యో! చూచితిరా? సర్వకాలస... నిట్లే. మిహిరను పంపివేసిననాటనుండియు నీతని యవస్థ యిట్లే యున్నది.

అబుల్—సమయము కని చక్కచేసిన స్వస్థపడును.

అక్బ—ఏమో! అన్నిటికిని మీదే భారము.

శా. ఆదిఁ బైరముఖాను పెదవడి చావై యున్న యీ మొక్కకుఁ
బ్రోదిం గల్పనఁ జేసె నా వెనుక మీరు న్మానసింహుండు పెం
పేదఁ సైనిక కార్యఖడ్గముల సద్వ్యాప్తిన్ననం జేసి రీ
పాదు న్నేతుహిమాద్రులంటుకొననీ పైభారము న్మీదిగన్. 32

అబుల్—పాదుషావారికినోట నిట్టి దైన్యోక్తులు వచ్చునంతప్రమాదమేమి సంభవించినది?

చ. చిన్నతనంబునం దుడుకు చేఁతలు చేసిన నట్టియున్న, ఈ
తెన్నులు పెద్దయైన కొలఁదిఁ దీఱవె, బాల్యమునందుఁ జెట్టలై
యున్న మనుష్యు లెందఱిల నూర్జితులై మనరే వయస్సు రా
నిన్నటికంటె పినికయి నీమన మంతమనఁ జింత మానుమా. 33

అక్బ—కుమారా! తెలివివచ్చినదా? మేము నేఁడే కార్యాంతరమునఁ బోవుచున్నారము. భవిష్యచ్చక్రవర్తివగుట నీతో నొకసంగతి చెప్పవలసి యున్నది.

సలీం—(లేచి చేతులుకట్టుకొని నిలువఁబడి తలవంచి) బరాబర్; సర్కార్!

అక్బరు—

చ. చటులాసేతు హిమాచలంబగు మహీచక్రంబు సర్వంబు నీ
పటుబాహాద్వితయంపుఁ బట్టునఁ దగన్ నిల్పం బూనితిః సుమ్ము; ఇం
కెటులం గాచెదవో కుమార, విను మేవృద్ధుండ నౌచుంటి మి
క్కుటమౌకష్టము లంది కూర్చితిని సూ! కోల్పోకుమీ రాష్ట్రమున్.

ఆబుల్—సార్వభౌమచంద్రా!

చ. కొడుకును నంతవాఁడె యగుఁ గూర్చు రాష్ట్రము మొన్న వాజిపైఁ
దడయక హల్దిఘట్టునఁ బ్రతాపుని యంతటిశూరుఁ డోలఁడే
గడగడ లాడరే రిపులు కైదువు చేఁ గొను నంత సింగపుం
గనుపున నక్కకూన బదునా చెదునా వినుమా విచారముల్.

వజీరు—సార్వభౌమచంద్రా! మనసామ్రాజ్యము ధ్వంసముచేయుట యంతసులభ
సాధ్యము కాదు.

సీ. అసహాయశూరసాహస విక్రముండగు ద
త్తీగాభుజం బీమానసింహుఁ డుండ
కార్యఖడ్గముల కొక్కఁడె చాలు రాట్పుత్రి
మల్లుఁడౌ తోడరుమల్లుఁ డుండ
సప్రాణమౌ జ్ఞానసర్వస్వ మీయబుల్
ఫజలను దేశికప్రవరుఁ డుండ
సంగీత సాహిత్య శౌర్యంబులకు నిధి
బీరబలుండను వీరుఁ డుండ
నీదు రాజ్యంబు వంక త్రినేత్రుఁడైన
తేఱిచూడంగలాఁడె విచార మేల?
వెడలిరమ్మింక వేగ దిగ్విజయయాత్ర
కొడవ పూరింపుమీ జయప్రదము గాఁగ. 36

(ఆస్థానము గంటమ్రోగును.)

అందఱు—జయము. జయము. పరమేశ్వరుఁడు మనపక్షమునఁ గలఁడు.

అక్బ—మిత్రులారా! నేటికి దర్బారు చాలించెను. సేవకా! అభ్యంతరమందిరమునకు దారిమాపుము.

(నిష్క్రమింపఁగాఁ దెరజారును.)

---

రంగము—చిత్తూర్ కోట.

[దేవిడీయెదుట సిపాయిలాయుధపాణులయి కావలియుండ లోపలఁగదిలో నొక మంచమునై రణమల్లుఁడు విశ్రమించియుండును. మనుమరాలు మోహినీబాయి యుపచారములు చేయుచుండును.]

రణ—బిడ్డా! పత్రికాప్రుఁడింకను రాలేదు. ఉత్తరమందెనో లేదో! నాశరీరస్థితి దినదినము క్షీణదశకు వచ్చుచున్నది.

మోహి—ఏవీ ఇంకను గడువుకలదే! మొన్ననేఁగదా మీరువ్రాసిన యుత్తరము నొక శిలీముఖ ముఖంబున నశ్వారూఢుఁడై పోవు నావీరాగ్రసరున కందఁజేసితి!

రణ—కుమారీ! నాకేయుపాయముఁ దోఁపకున్నది.

గీ. జగతు రుజక్రోధముగా లేచుఁజాల నేచు
వైరు లరికట్టి రెటులఁ బోవంగ నీక
తండ్రియే నన్నుఁ దారకుఁ దార్ప నెంచె
ఎవరు దిక్కింక నిను గావ నేదివెఱవు? 37

మోహి—దాదాజీ! నాకొకయుపాయము తోఁచుచున్నది. కోపగింపనేని మనవి చేయుదు.

రణ—బిడ్డా! నీపయికోపమా! ఎంతపాపమమ్మా! ఆయుపాయమేమి? నిరపాయమేని నవశ్య మవలంబింతము.

మోహి—నామాలమునఁగదా యింతచేటు వాటిల్లినది!

ఉ. మానము పోవనున్నయెడ మానవతీమణికిన్ స్వకీయమా
ప్రాణము పీఁకుటే వెఱ వటంచును దెల్పిరి నీతికోవిదుల్
మానితకీర్తిఁ బొందరె వినుమా యనుమానము మాను, మింక మ
త్ప్రాణము ధారవోసెదఁ గృపాణముచే నిజమానరక్షకై. 3

రణ—(చెవులుమూసికొని) హర హర! హతోస్మి! హతోస్మి! కుమారీ! ఆఁడు బుద్ధిచే సాహసించెదవు సుమా!

ఉ. పుట్టినకూటిబల్గ మది పోయిన నిన్గను చుండియే బిరం
బట్టితి ప్రాణమీతినుపున న్నినుబాసిన నాకు లోకమే
కట్టిది సాహసింప నది పల్కుము చేఁజెయివైచి, నీకు నా
యొట్టసుమీ తెగింపకుమి యోతనయా! వినయా! నయాన్వయా!

[అంత నొక యవనయోధుని వేషమున జయసింహుఁడు ప్రవేశించును]

జయ—(తనలో) అక్కటా! అప్పుడే కార్యము మించివచ్చినట్లున్నదే. నేనెంతత్వరిత గతి వచ్చినను సమయమున కందఁజాలనైతిఁ గాబోలు.

ఉ. ఎయ్యెడ మ్లేచ్ఛసైన్యచయమే! అరికట్టిన కోట నప్పుడే!
దయ్యములు న్పిశాచములు తాండవమాడెడు మేడలందు, నా
కయ్యెడ కేగుటెట్లొ? రిపుహస్తములం బడకుండఁ దొయ్యలిన్
చయ్యనఁ గాచుటెట్లొ తగుచందము తోఁచదిఁ కేమిచేయుదున్?

కానీ! ఇప్పటికీ వేషముననే కార్యము సాధించెదం గాక. (కొంతదవ్వరిగి) అప్పుడే యర్ధరాత్రము కావచ్చినట్లున్నది. (ఇటునటు పరిశీలించి)

శా. స్కంధావారమదెల్ల మాటుమణిగెన్ గాపున్న సైన్యంబులున్
బందస్తంభములట్లు నిల్చెఁ గరగవ్రాతంబులుం గూర్కెడిన్
గంధేభంబులు శాంతినొందె నిజఘీంకారంబుల న్మాని యిం
కం ధీదర్పము పేర్మి నే నిపుడె దుర్గద్వారముం జేరెదన్. 41

పోనీ ప్రాణిద్వారమునఁ జొచ్చుట కింతకన్న సుగమ్యము గానుండునేమో! (ఆలోచించి) ఛా! అదిపాపమశూన్యంబగు నాలోచన.

శా. సద్వంశంబున గొన్న రాజసుతుఁడన్ శౌర్యప్రతాపోజ్జ్వల
ద్విద్వద్వాదితుఁడైన శూరజయమల్ పృథ్వీశపుత్రుండ, నా
పద్వర్గంబున నున్న వారికెతఁ దీర్పవచ్చి యున్నాడ, సిం
హద్వారంబునఁ గాక వేఱుగతి డాయంజాతు నే భీతినై. 42

(కొంతదూరము నడచి) ఇదిగో! నల్లమద్దులవలె నిచ్చట నిద్దఱు సిద్దీలు తుపాకులు

దంకనూఁదుకొని నిలువఁబడి నిద్రపోవుచున్నాడు. (సమీపించి) ఓరి మొద్దులా గా! ఇదియేనా నీజాగ్రత్త! కదలడు! మెదలడు! నీ పట్టిచిన్నదని ప్రతాపు లే తుదపఁజాల గాపున్న నేనొక్కడనే కాను దళములకు దళములనే దింపివే యవచ్చును. ఇదిగో! ఈ మొద్దులలో నొకఁడు కదలుచున్నట్టున్నది. సరే! నిద్ద రమైకముచే వీరిచేతితుపాకులు తమంతనే జారినవి. మొదట వీనిని జాగ్రత్త పె ట్టవలయును. (తుపాకులుతీసి కొని) ఇంక లోనఁ బ్రవేశింతును. అభ్యంతరపర చెనా నాప్రతాపాగ్నికి వీఁడే ప్రథమాహుతి యగును. (లోనికిపోవుచుండును)

మొదటిసిద్దీ—కోణ్ హైరే అస్మ తైనో! తైరో!

జయ—ఫర్వానహీ! దోస్తి హై! (లోనికిఁబోవుచుండును.

మొదటి—దోస్తీ హై! నేస్తమ్ హై! అరెరే! శిస్తీగాం! ఉటో! ఉటో! దగా! దగా!

రెండవసిద్ది—మహారాజ్. గడ్‌బిడ్ ఖాణె. అర్ధారాత్రిఘాం దా నీకీ! ఆమీదమాకీ

మొద—అరే! ఉటో రే! బడేవోమం వచ్చాయ్ దగాఖోర్ జులుంసేసి తలాయిం చ్యాకపోతువున్నాయ్. సికుల్ పూమారా దసుల్యాజ్! (జయసింహునితో) ఆగు! ఆగు! తలాయించ్యాక యెంకమూగం పోతాన్. మాటా సెప్పు.

జయ—ఇదిగో! ఈకత్తి పోసే నీకుమాట.

(ఇరువురు కలియఁబడ నతికివేసి లోనికిపోవును.)

తుచ్ఛులారా! ఇంక మరెక్కడైన తిరిగి యట్లాను తలంచుకోనుఁడు. (లోపల ప్రవేశించి) అదిగో వృద్ధుఁడు మంచముపట్టైన మరుమగాలే కాంబోలు ఉపచారములు చేయుచున్నది. అయ్యయో! ఈమె కెంతదురవస్థ పట్టుచున్నది. హా! భ్రాతృద్రోహి! సాగరా! ఈసాధుబాధకు నీవే యుత్తరవాదివి సుమా! అక్కటా! చెక్కుగీరిన పాల్గారు నీసుకుమారశరీరిణి యీమెంగలాయీ యానాడు డోలా యగుటు. అక్కటా! ఈదీను రాలి ప్రస్తుతరూపమెంతజాలి పుట్టించుచున్నది!

చ. చిటిపొటి మాటల న్మసలి చిఁకునెకాదఁ గృశింపనీక ని
ష్కుటిలములైన చూపు లదిగు ల్పొలిపుచ్చఁగ నెట్లొ మాటి రో
రటులను పొంగివచ్చెను నిజాగ్రతరంగము లట్టె యూర్పు మి
క్కుటముగు పేరిమమూర్తి యనఁ గోమలి తాతపదంబులొత్తెడిన్. 43

మోహి—దాదాజీ! ఎవ్వరో మనదిక్కునకే వచ్చుచున్నట్టున్నది. వేషము చూడఁ గాఁ దురుష్కయోధునివలె నున్నాఁడు. ఇఁకనేమి గతి?

రణ—బిడ్డా! భయపడకుము. ఏదీ నాకైదువు?

శా. ఓరీ! మ్లేచ్ఛకులాధమా! నిలువు మీ వున్మత్తతం జెందినా
వా! రాత్రిం జొఱ సాహసించితివి రాజన్యస్ఫురద్వంశ బా
జారై పోయెనె నీకు, సాగరజ పుచ్ఛాంభోలు నిచ్చిట్లు; రా
రా! రక్తప్రసరప్రవాహము ల పారన్ జేతు నీమేనునన్. 44

జయ—అయ్యో! నాయీబహిర్వేషము వీరిని భ్రమింపంజేసినది. వీరబలా వృద్ధులు గదా! నేనెంతబుద్ధిమాలిన వేషము వేసితిని! (తీసివేసి)

చ. తడఁబడఁబోకుమోసుగుణ ధన్య! కసుకస్యుఁడఁగాను, నీవునుం
జడియకుమీ విభీత హృదయాంబుజలోచన! వచ్చితిం బ్రితా
పుం డనుప నేఁడ విరసపుతుండ, శ్రీజయమల్ సుతుండ, న
ప్పుడె మఱపాని మొన్నగిద, పోఁగని బాణమువోలెఁ గొట్టవే. 45

మోహి—(చప్పునలేచి చివాలున చాటునకుఁబోయి నిలువఁబడును.)

రణమల్లు—(ఆత్రముతో చేతులుచాఁచి) నాయనా! జయసింహా! వచ్చితివా? ఏదీ నన్నొక్కమాఱు కౌఁగిలించుకొనుము మ్లేచ్ఛసైన్యముచే నరికట్టఁబడినయీదుర్గము నర్ధరాత్రము నెట్లు చొరఁగలిగితివి? దారిలో నెవ్వరు నడ్డగింప లేదు గద!

జయ—(దగ్గఱకూర్చుండి) అడ్డగించిన సిద్దీల నిద్దఱఁ బెద్దనిద్దుర పొందించియే వచ్చితిని.

రణ—బలే! మంచిపనిచేసితివి.

మోహి—దాదాజీ! వారికళేబరములుపాఱవేయించినఁగాని ప్రమాదము వచ్చునేమో.

రణ—సరే! సేవకుల కాజ్ఞాపింతము.

జయ—(నవ్వి) అబల యగుటచే భయపడుచున్నది.

మోహి—(తలవాంచి) భయముకాదు. శవపములు గుప్తముగానడపించుట మంచిది కదా!

రణ—జయసింహకుమారా! అటుగాదు.

గీ. బాలయయ్యును గడుబుద్ధిశాలిని సుత
కుడిభుజంబట్లు నాకుఁ దోడ్పడును బనుల
నన్నిటికి దీనినే నమ్మి యున్నవాఁడ
దైవచిత్తం బదెట్టులు తనరఁగలదొ! 46

జయ—రణసింహ రాజచంద్రమా! ఇంకఁ దనుస్వాతంత్ర్యమున నాకంత కావఁ దేనియుం జోటీయంజనదు.

గీ. భూమితక సత్త్వాధి ప్రతాపునట్టి సింహుని
మెటిశూరుల ప్రాంతమువద మేను గలము
మూతిపై మీసములు నూకు మొలచి యుండ
నీసు నుట్టంగలఁడె తనసేతువై దైన. 47

మోహి—(జయసింహునిఁ జూచి సంతోషగర్వము నటించును.)

రణ—అందుకేగదా! ఈవిషమావస్థలో మీసహాయముఁ గోరుట. కుమారా! రాణా వారెక్కడ?

జయ—రేపటు నెల్లుటు సైన్యసమేతులై యిచ్చటికే వత్తురు.

రణ—నాయనా! చూచితివా మాయవస్థ! నాస్థితి నేఁడో రేపో యనునట్లున్నది, కావున ననితరలభ్యంబులును, అమూల్యంబులు నగు రెండు వస్తువులు మీవశము చేయవలసియున్నది. అంతపర్యంతము నాయంతరాత్మకు శాంతి యుండదు. అత్యంతపవిత్రయు శిశోదియావంశాలంకారయు నగు నీసుకుమార గాత్రి మదీయదౌహిత్రి మానధనం బొక్కటి—

మోహి—(సిగ్గుచే లోనికిఁ బోఁబోవును.)

రణ—బిడ్డా! సిగ్గేల? ఇట్టిప్రమాదస్థితిలోఁ జెప్పవలసిన సంగతులు చెప్పక మోమోటపడిన లాభమున్నదే! ఆగుము.

మోహి—లోపున చిన్నపనియున్నది. చక్కబెట్టుకొని యిప్పుడే వత్తును. (పోవును.)

రణ—కుమారా! ఇంక రెండవది పరమరహస్యము. (చెవిలో నేమో చెప్పి తలక్రింద గుప్తపరచిన యొక పేటికతీసియిచ్చి) అయ్యా! ఇందుఁగలవి గడింపరాని వస్తువులు. మనవా రుదయపురము తిరిగి స్వాధీనము చేసికొనిననాఁడుగాని దీనిఁ దెఱపింపఁ జనదు. అంతవఱకు నిది ప్రతాపుని యధీనమున నుండవలయును.

జయ—చిత్తము. దీనిని ప్రతాపుని కందఁజేయువఱకుఁ బ్రాణతుల్యముగాఁ గాపాడుటయే నాపనిగాని దీనిలో నున్నవానితో నాకు సంబంధములేదు. దీనిని తెరచువిషయమై తమయుత్తరవులు రాణావారి కెఱిగింతు.

మోహి—(తిరిగి ప్రవేశించి) దాదాజీ! కొంచెము పానీయము పుచ్చుకొనకున్న నుదయమునకు నీరసమెచ్చగును. (ఇచ్చును.)

రణ—(పుచ్చుకొని త్రాగి) బిడ్డా! జయసింహుని జూచినంతనే నాకెక్కడలేని సత్తువయును వచ్చినది. ఇంకను నీరసమెక్కడ ?

మోహి—ఆ ప్రసమాగమ మట్టిదియే. అందులో సామాన్యులు కారు. ఆపద్బాంధవులగు నాప్తులు. వేఱ చెప్పవలయునా !

రణ—కుమారా! జయసింహా! నిన్న నాకొక పాడుకల వచ్చినదోయి! అది కలగాదు నిజముగా జరిగిన దానివలె నిప్పటికిఁ గన్నులకుఁ గట్టినట్లున్నది. ఎవరో యొక రజపుత్ర స్త్రీయఁట మనసన్ని హితబంధువర్గములోని దేయఁట. ఢిల్లీలో జరుగు నౌరోజాపహారు చూడఁబోయినదఁట. ఎవఁడో స్త్రీవేషమున నందుసంచరించు చుండి యామెఁజూచి యురికట్టైనఁట. ఆమె నయమునను భయమునను వానిబుద్ధి మఱల్పఁ బ్రయత్నించెనఁట. అతఁడు వినక బలాత్కరింపఁజూచెనఁట. ఆమె తనయిలువేల్పు కాళీమాతం బ్రార్థించెనఁట. దేవి కత్తియిచ్చెనఁట. ఆమె కత్తియెత్తి వానిం దెగవేయం బోయెనఁట. అంత నాతఁడామె కాళ్ళపైఁ బడెనఁట. అంతలో కాళీమాత బాణభట్టుగా మాఱిపోయె. ఆ ధూర్తుఁ డక్బరు పాదుషాయయ్యె. ఆపతివ్రతాశిరోమణి మన కమలాబాయియే. అక్కడ నేనుంటి నఁట. ఇక్కడ మాకోట కాలిపోయినదఁట. మోహిని యేమయ్యెనోయని నేను మిగుల నారాటముతో బరుగులెత్తుచుంటినఁట. ఇంక నే వేవియో యూహింపరాని యసందర్భములు గల కల వచ్చినది.

జయ—మనసు చెదరియుండునపు డిట్టి కలలే వచ్చుచుండును. దీనినిగూర్చి విచారింపక నేటిరే నిశ్చింతగాఁ బండుకొనుఁడు.

రణ—సరే! మీరును సుఖనిద్రం జెందుఁడు.

(తెరజాఱును.)





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము.

(రాణాప్రతాపసింగు)



## తృతీయాంకము.

---

### 1. రంగము—ఢిల్లీలో రజపుత్రసామంతులుండువీథి.

[బాణభట్టు వ్యాకులచిత్తముతోఁ బ్రవేశించును.]

బాణ.—(తనలో) ఆహా! కార్పణ్యము! ఈపిశాచ మావేశించిన మానవుం డెంతటి పాపకృత్యములకైన వెనుదీయఁడు గదా.

ఉ. సైన్యపుఁ జేఁతలా, నికృతులా, యతులశ్రిత మిత్రఘాతలా,
శూన్యపుఁ బొత్తులా, యపరిశుద్ధపువృత్తుల, జీవహత్యలా,
కన్యలపాట్ల, కాఁపురపుఘాతల, తా నడిచేయ లేదు! కా
ర్పణ్యముఁ గొన్న చిత్తమపు రా! తలపోయునె పుణ్యపాపముల్.

పాపము! మాప్రతాపుఁ డెప్పుడో యీమానసింగునకు పంక్తిభోజన మీయలేదఁట. ఆపగ మదినుంచుకొని యిప్పుడాతని కుటుంబమున కీనీచుఁ డెంతటి యుపద్రవమును జేయ సంకల్పించుకొని యున్నాఁడు. ప్రతాపుని సోదరియు పృథ్వీరాజు భార్యయు నగు కమలాబాయికి రాఁబోవు నౌరోజా మహాయలో మానభంగము చేయింపఁ బాదిషాను బురికొల్పి కార్యాంతరవ్యాజమున నామెభర్తయగు పృథ్వీరాజును బట్టణమునుండి పైకంపి, తాను రత్నపూరుపై దాడివెడలి ప్రతాపభ్రాత సాగరజీ పుత్రి మోహినీబాయిని మొగలాయాజనానాశాలకు బంపుటకై భగీరథప్రయత్నములు చేయుచున్నాఁడు. జ్యేష్ఠుండగు సలీమును గులామును గావించి తన కాగి వేయుఁడగు కుమారిత రాజ్య

మిప్పించవలయునని చేయరానిపనులు చేయుచుఁ బడరాని కడగండ్లం బడుచున్నవాఁడు. పైకార్యసాధనోపాయము నిజభుజబల బుద్ధిబలంబుల కతీతంబగుటచేతఁ గాఁబోలు చంద్రికళయను నొక సానిదాని కాస చూపించి దానిచే నెన్నియో యకార్యములను గావించుచున్నవాఁడు. అదిగదిగో! చంద్రికళయే గాఁబోలు మానసింహుని మందిరంబునుండి వచ్చుచున్నది. నిన్న సాముద్రికవ్యాజంబున దీనినోటినుండి కొన్ని రహస్యములను వెడలఁగ్రక్కించితిని గదా! మంచిమాటలాడి నేఁడు మిగిలినవాని నూడఁ దీయవలయును.

[అంత చంద్రికళ మానసింహుని మందిరమునుండి ప్రవేశించును.]

చంద్రి—ఓహో! సాధూజీ! ఇక్కడనే యున్నారా?

భాణ—ఆ! ఇక్కడకేవచ్చినారము. రాజామానసింగు లోపలనున్నాఁడా?

చంద్రి—ఆ! ఉన్నారు. నిన్ననే రత్నపూరునుండి వచ్చినారు.

భాణ—రత్నపూర్ మోహిని వచ్చినదా? ముసలిరణమల్లుఁ డెట్లున్నాఁడు?

చంద్రి—పాపము. రణమల్లుఁడు గతించెనఁట. మోహిని యింకను రాలేదు.

భాణ—(తనలో రిచ్చపడి పైకి) సరే! నేఁడు కాకున్న రేపుజరుగవలసినదే. నారోజాలో కమలాబాయి వివయమగు నుద్యమము మానుపించు ప్రయత్నము లేమైనఁ జేసితివా?

చంద్రి—చేసితిఁ గాని కార్యములేదు. ఆవివ మప్పుడే ఛాదుపా తలకెక్కినది. ఇఁక దింపుట కష్టసాధ్యము.

భాణ—సరే! పశ్చాత్తాపమే పర్యవసానము. రేపే గాఁబోలు రుమ్రోజు. నీ వాపని మీఁదనే వారియింటికిఁ బోవుచున్నా వనుకొందును. పొమ్ము. పొమ్ము. విశేష దోహదము చేసితివా నీకొంప మునుఁగు. జాగ్రత్త.

చంద్రి—అయ్యో! నిజమునకు నాకీపని యిష్టములేదు. ఏమిచేయుదు! వారు ప్రభువులు. కాని స్వామీ! నాహస్తబలము పూర్తిగా సెలవిచ్చినారు కారు. కమలాబాయిగారియొద్దకుఁబోయి తిరుగుఁ దలలో మరల తమదర్శనము చేసికొందును. తమ రీప్రాంతముననే కదా యుందురు.

భాణ—నీహస్తబలము బహుప్రశస్తముగానే యున్నది. సావకాశముగా చూడవలయును. మంచిది పోయిరమ్ము.

(నిష్క్రమింపఁ దొరకొందురు.)

## 2 రంగము—పృథ్వీరాజు మహలుస్థలము

[కమలాబాయి విశ్రమించియుండును.]

కమలా—(తనలో) నేఁడేకాఁబోలు కుసుమరోజు పండుగ. అందులకు స్త్రీలే యుండవలెనఁట. దేశములో లేనివస్తువుల నెల్ల తీసికొనివచ్చి విక్రయింతురఁట. ఒకసారిపోయి చూచినం దప్పేమి? ఇంతకు భర్తగారి యనుజ్ఞ గైకొనవలెను. బాణకవి ముసలిపిచ్చచే లేనిపోని యనుమానములు పెట్టును. ఆ యనుమానముల కంతగా నాధారము కానరాదు. అదిగో బాణకవియే మరల వచ్చుచున్నాఁడు.

బాణ—(ప్రవేశించి) అమ్మా! చివరకుఁ బోవుటకే నిశ్చయించినారా?

కమలా—ఆ! అట్లే. తిరిగి రెండుగడియలలో వత్తును.

బాణ—సరే! మీచిత్తము. ఏదేని నవసరము తటస్థించినపుడు మనయిలువేల్పు మృగేంద్రవాహనను బ్రార్థింపుఁడు. గుప్తఖడ్గము మఱువకుఁడు.

కమలా—మంచిది. మీయుపదేశము శిరసావహించెదను.

బాణ—దేవి మిమ్ము రక్షించుఁగాక. నాకు సెలవు. (నిష్క్రమించును.)

[చంద్రకళ ప్రవేశించును.]

చంద్ర—అమ్మా! సవారీసిద్ధమయి చాలసేపయినది. ఇంక నాలస్యమేల? మనము తిరిగి వేగముగా రావలయును గదా!

కమలా—ఇదే వచ్చుచున్నాను. (ఇరువురు గలిసిపోఁగాఁ దెరవాలును.)

బాణ—(పైకివచ్చి) సరే! మీరు వెడలినారు. ప్రచ్ఛన్నముగ వీరిని వెంబడింపవలయును. స్త్రీలకుఁగాని ప్రవేశములేదఁట. మంచిది. ఆలోచించెదను. (పోవును.)



## 3. రంగము—అంతఃపురములో మహలు. మహలులో నొకగది.

చంద్ర—అమ్మా! ఈయంగడిలో చిత్రవిచిత్రములైన సరకులు ముద్దులగు వస్త్రములు, నగలు, నాణెములు, జరీచీరెలు, బుటేపరికిణీలు సమస్తము గలవు. రండు. ఎవరమ్మా ఈయంగడిలో? తలుపుతీయుండండి.

[స్త్రీవేషమునున్న యక్బరు తలుపుతీసి చంద్రకళను పొమ్మని సైగ చేయును.]

చంద్ర—అమ్మా! మీరిక్కడనే బేరము చేయుచుండుఁడు. ఇదే పొరుగంగడికి నేఁ బోయి యొకవస్తువు ఖరీదుచేసికొని చిటికలో వత్తును.

కమలా—చంద్రకళా! ఉండుము. నా కిది క్రొత్తస్థలము.

స్త్రీ—అమ్మగారూ! భయమూలేదండి. లోనికీదయచేయండి. వచ్చికూర్చోండి. మీరు కోరినవస్తువు తీసికొనివచ్చి యిస్తా.

కమలా—ఇది స్త్రీకంఠమువలె లేదు. మోసమాయేమి చెప్పుమా!

అక్బరు—(స్త్రీవేషముతీసి పైచి నిజరూపముతో) కమలా! ఇఁకదాఁపనేల? నే నక్బరును. నీదయఁగోరియున్నాఁడను. చేసినమోసము క్షమింపుము.

కమలా—(విస్మయస్తబ్ధయై కొంతవడి మాటాడనేరకుండును.)

అక్బరు—సుందరీ! నీముఖచంద్రబింబమునుండి మందహాసచంద్రికలం బఱచి నా నయనచకోరములకు విందుచేయుము.

కమలా—(చెదరినహృదయము కుదురుపఱుచుకొని తనలో) దైవసమానుఁడగు చారణకవి చెప్పినమాట యేల పొరపాటగు! ఆఁడుబుద్ధిచే సాహసించి యాపదలఁ దెచ్చికొంటిని. కానిమ్ము. ధైర్యమవలంబింపవలయును గాని మించినదాని గుఱించి విచారించుచుండిన లాభములేదు. సరే! చిత్తూరురసపుత్రికల చిత్తము లెంతమెత్తనివో నేఁ డీయక్బరుఫాదుషా యెఱింగెడింగాక (పైకి) సార్వభౌమా! ఇట్టి మోసముచేయుటలో నీయుద్దేశమేమి?

అక్బరు—నాయుద్దేశము నానోట నే చెప్పింపవలయునా? నీకొఱకే, నిన్నుఁగోరియే!

కమలా—ఓహో! అలాగునా? నీస్థితి చూడ నాకు మిక్కిలి జాలి కలుగుచున్నది.

ఉ. పుట్టినదా తలంప మగపుట్టువు, వంశము తానమూల్యమై
నెట్టన రాజమౌక్తిక మణివ్రజ మీను మొగల్ కులంబు, చే
పట్టినదా యఖండమగు భారతరాజ్యరమాసునాంగి సీ!
యెట్టుల వేసికోయి! కడుహీనము నీమది యాఁసుజేసెఁగుఱ్ఱ. 49

అక్బరు—సుందరీ! మీ స్త్రీజాతిని గౌరవించుటకే నే నీవేషము వేసితిని. దానికేమి? ఏదీ? నీకొఱకై వేసిన నా యీవేషమును బహూకరింపుము. రమ్ము. ముద్దిమ్ము.

కమలా—ముద్దా కావలయును? అయ్యో! మీరు పెద్దలు. భారతభూచక్రము నెల్ల నేకచ్ఛత్రాధిపత్యమున నిరతిదనుక మిగుల ప్రజారంజకముగా నేలుచున్న చక్రవర్తులు. నే నాఁడుదాన. విశేషించి మగనాలు. ఇట్లుగచాట్లఁబెట్టుట తగవు గాదు. ఇంతకు నిది వృథాశ్రమ! నస్నేల కష్టనిష్ఠురముల పాలుచేసెదరు?

అక్బరు—కష్టమా! నిష్ఠురమా! బాలా నీ కెంత చేలవు?

చ. ఎఱుగవు గాక నీస్థితి ఫలింపఁ దిశయె గాదె, తమస్త్ర ... 
శూరుఁడు తనంతఁ దా [illegible]

బరిగిన క్రిమ్మరం బౌసఁగ నౌని సృజించిన బ్రహ్మకైన నీ
బిరుసు వనాలు మూఁడి వదవే మున ముందఁగఁ భానుమా మొసిగా.

కమలా—ఆర్యా! మూర్ధాభిషిక్తుండవగు నీనోట నిట్టిమాటలు వచ్చుటయు నే విని సహించుటయు నెంతకష్టముగా నుండును!

అక్బరు—ఏమీ! నామాటలు నీకుఁ గష్టముగా నున్నవా?

చ. గరళము ద్రావు నుంటి నను దిగంబడు చుంటి నను నిప్పు నుంటు గోఁ
గఱఁగొని యేసితో మొసకుఁ గట్టితినో పెనుగండగ త్తెఱక
పరువపు జాణవౌ మన్నె సెబాసన వచ్చుచు పాను పాహికిఁ
హారువగు చేతి గాఁజితుకనై నుదమొ ముట గూడ కష్టమే.

ఓరమణీశిరోమణీ! ఏరాజరాజేశ్వరుని కీర్తి డిండీరములు పూర్వాపరజలధీపరివలయిత మహామహీతలంబున పోటుపాటులు లేక నిరంతరము నాట్యమాడుచుండునో, ఏయాజ్ఞ చేత నిలుపఁబడిన విజయపతాకావితానంబులు శీతాచలరత్న సానువులమీఁదను మేరు మహీధరపు గాలిగోపురములమీఁదను నెగురుచుండునో, ఏవసుంధరాధీశ్వరుండు స్వకీయరాజకీయ ప్రతిభాకౌశల్యముచే హిందూమహమ్మదీయ బృందముల స్వమత వైమనస్యముల నిమేషమాత్రములో నదృశ్యముఁ జేసి రెండు తెఱంగులవారిని రెండుకన్నులుగాఁ జూచుచు నుభయుల మన్ననలకుఁ బాత్రుఁడగుచున్నాఁడో, ఏసర్వసర్వంసహాధీశ్వరుండు తన మహైశ్వర్యసంపదచే శర్వుం దృణీకరింపఁజాలియు నిగర్వచూడామణియై మెలంగుచున్నాఁడో అట్టి భారతసార్వభౌముండు, హిందూస్థానమహాసామ్రాజ్యలక్ష్మీ మనోనాయకుండు, అక్బరుచక్రవర్తి నీచెట్టఁబట్టి నీ సేవఁజేయు మహాభాగ్యము దయచేయుమని యనిర్వచనీయ ప్రేమపూర్వకంబుగా నిన్ను, శిశోదియావంశభూషణమవగు నిన్ను, చిత్తూరువంశక్షీరపారావార కమలాలయ వగు నిన్ను ప్రార్థించుచున్నవాఁడు!

కమలా—అయ్యా! స్వోత్కర్షమై దీర్ఘోపన్యాసము చేసి యెంతయు నలసియున్నాఁడవు. ఇఁక నామాటయు వినుము. ఏవంశమునం దాణిముత్తెములంబోలు పతివ్రతా శిరోమణులును, అభిమన్యుకల్పులగు యోధాగ్రయోధులును, కుంతీదేవి కెనయగు వీరమాతలును, జనియించుచున్నారో, ఏరాజపుత్రశాఖ నేటిదాఁక తురుష్కసంపర్క కళంక దూరంబయియున్నదో, ఏరాట్కులమను రత్నాకరము స్వకీయమానసంరక్షణకై నిజప్రాణమైన తృణప్రాయముగా విసర్జించు

టకు లేశమాత్రమైన వెనుదీయని పతివ్రతాశిరోరత్నముల కాకరంబో, అట్టి శిశోదియావంశమునఁ బుట్టిన కమలాబాయి, అమిత ప్రతాపతేజఃపుంజమగు ప్రతాపసింహరాణావారి తోఁబుట్టువగు కమలాబాయి, నేఁడు ప్రమాదవశమున నీసామంతులలో నొకరుగానుండఁదటస్థించిన పృథ్వీరాట్సత్కళత్రమగు కమలాబాయి, అమాయికలోకమునెల్ల నిటులనే వంచించుచు మంచివాఁడ వనిపించుకొనఁ బ్రయత్నించు మేకవన్నె పులివగు నీకు, సార్వభౌముండవగుటచే స్వకీయావర్తనమున సమస్తప్రజలను సన్మార్గమున నడపించు నుత్కృష్టబాధ్యత గల నీకు, సంసారసుఖసారమునెల్ల నిరవశేషంబుగా ననుభవించి విసిగి వేసారి నీయంత తనయులను మనుమలను గనిన నీకు, ఇట్టి తుచ్ఛపు, హేయపు, నీచపు, గోర్కి తగదనియు అందునకుఁ దానెంతమాత్ర మంగీకరింపఁజాలదనియుఁ త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నయది.

అక్బరు—(తనలో) ఏమీ! సమస్తభారతోర్వీ సార్వభౌముండనగు నాతోడనే యింత నిర్భయముగా, ఇంతనిర్లక్ష్యముగా, ఇంతకచ్చితముగాఁ జెప్పుటకీమెకింత ధైర్య మెచ్చటినుండివచ్చినదో! ఆహా! అది వీరి చిత్తూరువీరమట్టి సారము. ఆహా! భరతఖండమా! మేల్మేలు! నీక్షేత్రసారమెంతస్తోత్రపాత్రము! సరే! ఇది ప్రశంసలకుం దగినయదను కాదు. ఆఁడుదానిచే నిట్టి సూటిమాటలు పడి మిన్నకుండినచో నిఁక నన్ను గణించువాఁడెవ్వఁడు? ఎట్టయిన పట్టినపట్టు విడిచిపెట్టక వాకట్టి యీమెచెట్టఁబట్టఁ బ్రయత్నింపవలయును. (పైకి) సుందరీ! ఏమనుచున్నావు? నాది హేయపు, తుచ్ఛపు, నీచపుఁగోర్కెయా! నీదేమో పవిత్రపు, పరిశుద్ధపు, పారమార్థికపు వంగడమా? అవును. ఆత్మస్తుతియుఁ బరనిందయు నగ్గతో రంగరించి పోసినవియేగదా మీవంగడంపు సంగనామములను. దానికేమిలే నీవుచెప్పినట్లు నాకోర్కి తుచ్ఛమో స్వచ్ఛమో హేయమో శ్రేయమో యెట్టిదైన నగుగాక. నీవిప్పుడు దానికంగీకరింపక తప్పదు. వృథా ప్రయత్నములు మాని—

ఉ. బల్లపు తాలగోడలను భాసిలుమేడల హంసతూలికా
తల్పములం దుపస్థమణితారమరీచులు రత్నదీపికా
శిల్పరుచిం హసింపఁగ వశీకృత మన్మథరాజ్యలక్ష్మివై
మెల్పునఁ బొల్పునం జెనఁగుమీ! తగుస్త్రీ! మొగమోటమేటికిన్.

కమలా—ఓహో! ఏమాసంపత్తి! హంసతూలికాతల్పములంట! రత్నదీపికలంట! తారహారములంట! ఎంత వెఱ్ఱివాఁడవయ్యా నీవు! ఎన్నఁడు నెఱుంగని గర్భదాసికిఁ జెప్పినట్లు చెప్పుచున్నాఁడవు!

అక్బరు—అయ్యో నీ వాగర్భశ్రీమంతురాలవే యగుదువు. పాపము! జయపూర్, బికనీర్, జోద్పూర్ రాట్కుమారికలు గర్భదాసీలగుట నే కాఁబోలు మా జనానాయందున్నారు. లేక వారికి నీసాటి చదువుసాములు రావో!

కమలా—రాకేమి? నాకన్న మిన్నగా నే వచ్చును. అందుచేత నే చదువుసాములయందు దమకు సమానపుఁ జేయికనఁదగు నీగరిడీయందుఁ జేరుచున్నారు. ఇంతకు శీలము సాంప్రదాయమునుబట్టి యుండును.

అక్బరు—ఏమీ! వారిసాంప్రదాయ ప్రతిష్ఠలకన్న మీవంశప్రతిష్ఠ లుత్కృష్టతరమైనవియా ?

కమలా—ఏమో! ఎవరివంశప్రతిష్ఠలు వారివి. మంచిచెడ్డలు కాకులవలె లోకులు చెప్పుకొనుచునేయుందురు. ఇంతకును నీవిపుడుచెప్పినట్లు నేను జయపూర్, జోద్పూర్ బికనీర్ రాట్కుమారికలంత దర్జాగలదానను గాను, అంత జాణనుగాను! ఎందుకు నన్ను రేఁపెదవు ?

సీ. నీమాయమాట లన్నియు నమ్మి చెడిపోవ
బికనీరు రాట్కుమారికను గాను,
నీడాబుదర్పముల్ నిజ మనుకొని లొంగి
పో మానసింగు తోఁబుట్టు గాను,
నీబెదరింపుఁ బన్నికల లోనై పోవ
జోద్పురాధీశ్వరు సుతనుగాను,
మానాభిమానముల్ పోనాడి నిను గూడ
రైసింగు లుబ్ధుని రమణిఁ గాను,
గీ. మానరత్నమ్మకై నిజప్రాణ మైనఁ
దృణగతి స్వీడ వెనుదీని ధీరతర శి
శోదియావంశభూషణమై దనరుచు
వెలయు చిత్తూరువిభు నింటి బిడ్డ నేను.

అక్బరు—ఓహోహో! చెప్పితివిగావు మీవంశప్రతిష్ఠ. నీమాటకుఁ దగినట్టులే ప్రత్యుత్తరమీయవలసివచ్చిన యెడల,

సీ. కమనీయరత్నముల్ గనులలోఁ దాఁచిన
రజతాద్రి మకుట మేరమణి నాల్చు
భూరిసింధుబ్రహ్మపుత్రా సరిద్రత్న
భుజకీర్తు లేబాహులవులఁ దనర్చు
చారుభాగీరథీ తారహారమరీచు
లేయురస్థలమున నింపు నింపు
వలెవాటు వలెనున్న బర్మాంశుకాగ్రమే
కోమ పయోధరమహీధ్రముల మాటు
గీ. ఇట్టి భారత భూకాంతయే మదీయ
పాణిఁగొని దేవాళీపురవతుమ్మాదు
నెప్పుడు నమూల్యభద్రాసనోత్తమమున
నిలిపె నీవెంత, నీకున్న నీమ మెంత! 54

కావున నోవగలాఁడీ! ఇఁక శెట్టుసేయక పట్టుఁదలమాని నన్ను చేపట్టి నామన్ననలందుము. ఇంతకువచ్చిన తరువాత నూరకుండుట కక్బరంతచేతఁగానివాఁడు కాఁడు. నీవొక్కతవే మాటకారివియుఁగావు. చూచితివా మాటకు మాటు తెగులు! ఏలవాగ్వ్రియము?

కమల—అయ్యా! నాభర్త నీకు సామంతుఁడనియు, మేము నీరాజధానిలో నుంటిమనియు, సార్వభౌముండవగుటచే సర్వాధికారములు నీచేతఁగలవనియు గర్వింపకుము. నిజము. సమస్తభారతీయులకు నీకే యిప్పు డధికారివి. కాని నీమీఁది యధికారి దైవమున్నాఁడు. అతఁడు మనుష్యుల పుణ్యపాపము లనునిత్యము వేయికన్నులతో పరిశీలించుచుండును. ఓయీ! నీయీపాపకార్యముల కాసర్వేశ్వరునియెదుట నేఁడు గాకున్న రేపు విమర్శింపఁబడక తప్పదు. ఇప్పుడు లోకులకన్ను భ్రమినట్టుప్పుడు పరమేశ్వరుని కన్నుభ్రమి లేశమైన మభ్యపరచగలవా? ఎంతమాత్రము మభ్యపరచలేవు! చేసినతప్పొప్పుకొనకతప్పదు. అప్పుడుగదా చూడవలెను. ఢిల్లీపాదుషావారిస్థితి! నోటమాటరాదు. ఒడలం కంపింపనారంభించును. తట్టుదిమ్మత్తమునకు [illegible] సంత[illegible]గా నకుప్రబిందు

కలముఁ గుంచెయుఁ గొని యవంగడియు మాను
మోహినీ వ్రాసితివి జగన్మోహనముగ. 105

సుందరీ! నీ చిత్రకళాకౌశల్యమెంతయుఁ బ్రశంసనీయము. కాని నాదొక్క కోరిక కలదు. మా రాజకుమారి చిరకాలమునుండి దురంతచింతాకులస్వాంతయై యున్నది. ఆమె చిత్తము రంజింపఁజేయుటకై నీవు వేఱొకరి చిత్తరు విందుఁ బొందుపఱచినంగాని యిది పూర్తికానేరదు.

కమలా—ఎవరిచిత్తరు వింక హత్తింపవలెను?

చంద్రి—ఎఱుఁగవువుగదా! సామంతాధీశ్వరుండగు జయసింహకుమారుని. ఆకుమారవీరుని యాకారము లేక యీ చిత్తరు వీమెచిత్తము నాకర్షింపఁజాలదు.

మోహి—చాలు! చాలు! అవి నిశ్చయముగా మీమనస్సులందలి కోరికలు.

కమలా—నొచ్చుకొనకుండమ్మా! హాస్యమాడినంతమాత్రనే యాగ్రహింతురా?

చంద్రి—కవిదా! హాస్యమునకుగాదు. మీ రాజసింహు నెప్పుడైనఁ జూచి యుంటిరా?

కమలా—చూడకపోవుటేమి? ఆతఁడు రసపుత్రవీరకంఠీరవుఁడగు జయసల్లుని పుత్రుఁడు. మాబంధువర్గములోనివాఁడు. ఇదే చిత్తగింపుఁడు. ఆతనిచిత్తరువుగూడ ప్రస్తుతము నాయొద్దనున్నది.

చంద్రి—నాకెప్పుడు నాతనిఁ జూచుభాగ్యము లభింపలేదు. చక్కనివారిలో నెల్ల చక్కనివాఁడనియు, నగరిమికిఁ బుట్టినిల్లనియుం జెప్పుకొందురు. అయినను చూపుఁడు. చిరపరిచయము గలదగుట మా మోహినియే విమర్శింపఁగలదు.

కమలా—ఇదే తిలకింపుఁడు. ఇదివఱకు చూడకున్నను లోచనపర్వమగు నీవిగ్రహముం జూచి యభినందింపుఁడు.

చంద్రి—(చూచి యాశ్చర్యముతో) ఆహా! ఎంతచక్కని యందకాఁడు. బ్రహ్మసృష్టిలో నిట్టి సర్వాంగ సౌష్ఠవాకారులున్నారా యనిపించుచున్నది. బిడ్డా! మోహినీ! రావే! చూడవే!

మోహి—(చూచియుఁ జూడనట్లు చూచి చంద్రికళయం దసూయాభావమును సూచించుచు.)

చంద్రి—ఆహా! ఏమి యీ యద్వితీయసౌందర్యము!

శా. ఆకర్ణాంతదృగంతముల్ కనులు శౌర్యాసక్తి సూచించు న
స్తోకంబైన విశాలఫాలమెఱిఁగించు న్బుద్ధిసంసిద్ధిదో

ర్యక్షకోఁజాబయిటయుబ్బు చెతుము నయోత్సంబు తయుందోఁచు సు
శ్లోకాజానుభుజస్వామే తెలుపు నిచ్చో పీసికొర్యోన్నతిన్. 105

బిడ్డా! మోహినీ! రావే! అనుభవింపవే కన్నులు గలిగిన ఫలము.

మోహి—(తనలో) అబ్బా! అపకీర్తిచరిత్రుని చిత్రఫలక మీయపాత్రి రాలిచేతం జూచుటకు నాకెంతయుఁ గష్టముగా నున్నది! ఏమిచేయుదు!

చంద్రి—బిడ్డా! రావే! ఏ మాలోచించుచుంటివి! పోవే! కాదిత్యమంగళవిగ్రహ మాతఁడగునో కాఁడో చెప్పనైన చెప్పవు.

కమలా—(తనలో) ముద్దుగారు నీవిద్దంపుటద్దము కాని జూచి యీపడవు విద్దియల లొద్ద కెద్దియో దుష్టబుద్ధి యంకురించినట్లున్నది. నిజముగను నేనుఁ బొరపాటే చేసితిని. కానీ! ముందుముందుగతి యాలోచింపవలయును. ఇదియు నొకమేలుకొ ఱకే వచ్చినదేమో! కుక్క కాటునకుఁ జెప్పుదెబ్బయనునట్లు మోసమునకు మోసమే గదా ప్రతిక్రియ! ఎట్లయిన జయసింహుని కారాగారవిముక్తుం గావించుట ప్రస్తుతకరణీయము. (పైకి) అమ్మా! ఇది తప్పక జయసింహుని చిత్తరువే. మీకనుమాన మున్న యెడల నాతని మీ రెప్పుడైనఁ జూడఁదలఁచినచో స్థిరపఱచుకొనవచ్చును.

చంద్రి—ఎప్పుడో యననేల? ఇప్పుడాయనయీకోటలోనే చెఱసాలలోనున్నాఁడు. పోయి చూతము రమ్ము. చిత్రకారిణీ! నీవు మాకోటలో పదిపూఁటలు లాగవలయును జుమా! దయయుంచి నాప్రార్థన చెల్లింపుము. మనము కలిసికొనిన వేళావిశేష మేమియో నిన్ను వీడవలె నొప్పకున్నది. మోహినీ! నీవును వత్తువేమో రావమ్మా చిత్రపటపరీక్షకు.

మోహి—నేను రాను. వీరపురుషుల నట్టియవస్థలోఁ జూచుట మర్యాదకు విరుద్ధము.

చంద్రి—అబ్బా! ఏమిమర్యాద లెఱింగిన దానవమ్మా నీవు!

కమలా—మర్యాదల మాటకుఁ గాదుగాని—

తే. గీ. పంజరమునందు బంధింపఁబడి కృశించు
సింహమును జూడ వాస్తవస్థితి తెలియునె;
అట్లె చెఱనున్న జయసింహు నందు నీవుడు
ఒక్కసగివాట కలరూపు చిక్కునెట్లు? 106

అందుకుఁ గాఁబోలు నీమందయాన సందేహించుచున్నది.

చంద్రి—ఓ చిత్రకారిణీ ! నీవు మిగుల సమర్థురాల వగుటచే నొకరీతి సుందరికాళ్లకు బంధము వేయుచు నింకొకరీతి నీమె యవినయమును సమర్థింపఁబ్రయత్నించుచున్నావు. కాని జయసింహుఁడెంతమాత్ర మీ కారాగారవాసముచే చిక్కినవాఁడై యుండఁడు. నిర్బంధ మతఁడీమోహినికొఱకుఁ గోరితెచ్చుకొనినదే. ఒకవేళ నిదివఱకే యువజనమనోమోహినియగు నీమోహినికిఁ జిక్కినవాఁడైనఁ గావచ్చును.

మోహి—ఔనౌను. అందుచేతనే ! ఈచిత్రఫలకముం దిలకించిన తోడనే నాయొడలు పులకించినది. తొలిజవ్వనంపుఁ బ్రాదుర్భావమంతయు నొక్కపెట్టున గులకరించినది. మంచిచెడ్డల నెంచక యాతనిఁ బలుకరించుటకై యున్నపాటునఁబరువు లెత్తుచున్నాను.

చంద్రి—చిత్రకారిణీ ! వింటివా ! ఈకొంటెపిల్లతుంటరిమాటలు ! ఇటువంటిమాటలు వినిన లేనివారికైనఁ బుట్టుకొనివచ్చును. అగునా కాదా ?

కమలా—పోనిద్దురమ్మా ! పసిబిడ్డ ! ఈమెమాట లొకపట్టా ?

చంద్రి—(మోహినికి వినిపించకుండ) పాపము ! పసిబిడ్డ ! పాలుత్రాఁగుచున్నది. ఇటువంటివారే చూచుటకుచుంచులు, చేయునవి పందికొక్కుచేష్టలు ! రమ్ము ! పోదము. (ఇరువురు పోవుచుండఁగా గులామెదురుపడును.)

గులాం—సలాం ! సెంద్రికళాదేవిగారికి చోటాసర్కార్ గులాఁనోట్రితోఁసలాంసేసీ హుకుంసేసేనేది యేమఁటే.

చంద్రి—చుప్ (చెప్పవద్దని సైగచేయును.)

గులాం—ఈవు త్వరాం మే నూసికొండి.

చంద్రి—(స్వ తరము చూచుకొని) ప్రభువావి రిప్పుడే ప్రమదావనమునకు వచ్చినచో దర్శనము చేసికొందునని చెప్పుము.

కమలా—(తనలో) సరే ! ఈత్రాఁగుఁబోతుగూడ నిక్కడనే యున్నాడా! మోహిని విషయమై మతింత కనుగలిగి ప్రవర్తింపవలయును. ఏవెఱవునైన జయసింహుని విడిపింపఁ బ్రయత్నింపవలయును. ఈఖోగపత్రలొత్తలరా యాయు తరము మిక్కిలి గోప్యముగా దాఁచుచున్నది. ఒకయుక్తిఁ జేసి దానియందలి సంగతు లెతింగెదంగాక. (పైకి తిచ్చపాటుతో) అయ్యో ! సమయమున కొకకాగితపు ముక్కయైనఁ జేతఁజిక్కకపోయినదిగదా !

చంద్రి—ఏమిా ? నీకేమి కావలయును ?

కమలా—ఏమియుఁగాదమ్మా! చిన్న కాగితపు ముక్క! నేత్రపర్వమగు దృశ్యమొక్కటి యిక్కడ దృగ్గోచరంబయినది. దానిని జిత్రించుటకొక చిన్న కాగితపు ముక్క గావలయును.

చంద్ర—ఇదే కాగితము. ఇందు మిక్కిలిఁ గొంచెమే చోటు కలదు. ఏపనికిఁ బనికి వచ్చునేమో చూడుము.

కమలా—చాలునమ్మా! ఏమాత్రమున్ననుఁ జాలును. జ్ఞాపకార్థము దిక్ప్రదర్శనముగా నొకించుక గుర్తించుకొనుట కున్నఁజాలును. అది చిత్రము కాఁబోలును ఏమైనరహస్య—

చంద్రి—నీయొద్ద మాకే రహస్యములును లేవు. ఇంక నొకనిమిషములో నామనస్సె నీయొద్దఁ బెట్టఁదలఁచుకొన్నాను. నీయెడ నాకు దాపరికమేమిటమ్మా! మనము కలిసి యొకదినమైనఁ గాకున్నను చిరకాలపరిచయులకన్న మిన్నయగు స్నేహము కలిసినది. అది వేళావిశేషమో లేక నీముఖమునందు సహజముగాఁ గన్పించుచున్న ప్రసన్నవశీకరణశక్తుల ప్రభావమో కావలయును.

చ. పసగలమాటలే యెఱు నవశ్యను వశ్యము సేయుమాత్రముల్
మిసమిసలాడుచూపులె నిమేషములో ధృతిఁ బాపుకూఁపులౌ
మసియనుగుంచెయే విధికి మాఱుగ సృష్టియొనర్పఁజాలు, నీ
రసనను వాణియుం గనుల లచ్చియుఁ గేల విరించి యొప్పరే!

అదే జయసింహుఁడుండు కారాగారము సమీపించినారము. నీకొక పరమరహస్యము చెప్పెదను. నీకడుపునఁబెట్టుకొని నాకిందులోఁ జేతనగు సాయము చేయుదునని నా చేతఁ జై వేయుము. (చేయిజాఁచును.)

కమలా—మావంశీయుల నోటిమాటయే ప్రమాణము. తెలియనియంశములో ముందుగా మాటయిచ్చి యొట్టుఁబెట్టుకొనఁజాల.

చంద్రి—అయిన నిన్ను నేనెట్లు విశ్వసింపఁగలను ?

కమలా—విశ్వసింపకున్నఁ బోనిండు. నాతో నట్టిసంగతులే చెప్పకుఁడు. మీకేమి బందెయా బలవంతమా !

చంద్రి—సుందరీ! క్షమింపుము. నాకడుపులోని యోచన యిది. (చెవిలో నేమియో చెప్పి) ఇందులో నీసహాయ మపేక్షించి యుంటిని.

కమలా—సరియే! ప్రయత్నింతము. కాని నేను చెప్పినట్లు మీరు వినవలయును. మీ[illegible]

లోని పరివారము కొద్దిదినములు నాచెప్పుచేతలలో మెలంగునట్లు సర్వదుంఖాలాయగు హుకుమొక్కటి నాకు దయచేయింపవలయును. * * మఱచితి మఱొక్క మనవియున్నది. అగత్యమైనయెడల మనపనిలో సహాయము చేయుటకు త్రికాలవేదులగు పెద్దలు మాగురువుగా రొకరున్నారు. పనిపడినప్పుడు వారినొక్కపరి యిచ్చటకు రప్పించుటకు నాకనుజ్ఞ దయచేయింపవలయును. నావి హిరణ్యాత్మపరము లనుకొందురేమో మున్ముందు నాసంగతి మీకే తెలియఁగలదు.

చంద్రి—నీ వేమిచెప్పిన నదిచేయుటకు సిద్ధముగా నున్నదాన. అగ్నిలో దిగుమన్న దిగియెద. నీటిలో నుఱుకుమన్న నుఱికెద. ఎట్లో కార్యముమాత్రము సాధింపవలయును. చూచితివా! ప్రస్తుత మీయుదయపురపుఁగోట నావశమై యున్నది. నేను నీవశమై యున్నదాన.

కమలా—సరియే శక్తివంచనలేకుండఁ బ్రయత్నింతము. మీరు ముందునడువుఁడు. (తనలో) అబ్బా! ఈపడఁతి కడుఁపులో నెంత తలకుమించిన యోచన కలదు. కాని! దీనికిఁ దగినప్రాయశ్చిత్తము చేయింపకున్న నేను కమలనే కాను. ఈతార్పుగత్తె నాఁడు నన్ను వంచింపఁ దననేర్పు చూపినదిగదా! నేఁడు దీనిని వంచింప నానేర్పు చూపించెద.

(ఇరువురు నిష్క్రమింతురు.)

మోహి—(వ్యాకులచిత్తముతో మధ్యానవనమునందలి యొక వేదికపై విశ్రమించి) హా! పరోపకారపరా! స్వార్థత్యాగశీలా! జయసింహకుమారా! మందభాగ్యురాలనగు మన్నిమిత్తమున నీవెంతటి విపత్తులకుఁ బాత్రుఁడవగుచున్నావు! అక్కటా! నాదెంతపాపిష్ఠిజన్మము. స్వకామ్యసంతుష్టికై నీయట్టి లోకమాన్యోత్కృష్టచరిత్రులఁ గష్టములంగూర్చి దేశమునకుఁ గలసిరాని మహారిష్టములను దెచ్చిపెట్టుచున్నదాన. ఏయుపాయము చేతనైన నాయీదురదృష్టపు జన్మమును దుదముట్టించిన లోకమునకు మేలుచేసినదాన నగుదును.

(నిష్క్రమింపఁ దొరఁకొనును.)

## రంగము—రత్నపురముకోట.



[ప్రతాపుఁడును బంధుమిత్రులును ఉచితాసనములపై విశ్రమించి కార్యాలోచన సేయుచుందురు.]

పృథ్వి—మిత్రమా! ఇం దాశ్చర్యమేమున్నది! ఖద్యోతకాంతివలె పాపమప్పటప్పటి తాత్కాలికానందముం గూర్చుచుండినను తుట్టతుదకు దానిఫలముఁ గట్టికుడుపక మానదు.

చ. పొలుపఱి యెవ్వ రెల్లు చెడిపో యిననేమి! స్వకీయకార్యముల్
సులువుగనైనఁ జాలుననుచుం బలుకొంపలు గూల్చెవీఁడు; వ
ర్థిలఁగలఁడే! కృతంబెఱుఁగు దేవుఁడు లేడెయొకండు; నాఁటిగో
వులఁ జెడదిన్న రాపులుఁగు బ్రుంగదె తానొక గాలివానకున్.

బాణ—అభిమానహీనుండును, ఆత్మగౌరవశూన్యుండు నగు నామానసింహున కీదెబ్బతోఁ బూర్తిగా శృంగభంగమై యుండనోపు.

అమర—స్వకార్యసిద్ధికై నిరంతరదుర్వ్యాపార పరాయణులగు నట్టివారి కిట్టిశృంగభంగముల వలన బుద్ధిరాదు. శిరశ్ఛేదమే వారికి బుద్ధిచెప్పుమార్గము. ఇంతకు వాని కిప్పుడైన శృంగభంగ మేపాటి?

బాణ—ఇంకేమి గావలయును! కమలామానభంగ- (నాలుకఁ గఱచుకొని) నాటి కుష్రోజు ముచ్చట యట్లు పరిణమించెనుగదా! నేఁడు కుమారికను రాజ్య మిప్పింపవలయునను ప్రయత్న మిట్లయ్యెనుగదా! అన్నట్లు చెప్పుట మఱచితి. కుమారి యిప్పుడు మతిచెడి మానసింగు కనుపడిన నటికి వేయుదునని యతికిపడు చున్నాఁడఁట.

ప్రతా—కారణము?

బాణ—తనసోదరి నర్పించునప్పుడు మానసింహునకు నక్బరునకు రహస్యప్రమాణంబడిక యొండు జరిగియుండెనఁట.

ప్రతా—అది యేమైయుండునో?

బాణ—తనభాగినేయునకే భవిష్యద్భారతరాజ్య మిప్పింపవలయునని.

పృథ్వి—అనఁతమీఁదనే రాధాబాయి యక్బరుం బెండ్లియాడుటకు అంగీకరించెనని వదంతి.

బాణ—ఇప్పుడక్బరు తనయనంతరము సలీమునకు రాజ్యమిచ్చివేయుటకు నిశ్చయించుటచే నామె యాశ లడుగంటినవిగదా! అందుచే నామె విషము తిని మరణించినది. తనతల్లిచావునకు మేనమామయే కారకుఁడని మానసింగుపై కుస్రూ పగఁబట్టియున్నాఁడు. సలీమున కీమ స్వతంత్రిమెట్లో తెలసినదఁట. ప్రస్తుతము విజయలక్ష్మి తనయెడ వెడమొగము పెట్టుటచేఁ దాను పాదుషా దయ కెక్కుడ దూరస్థుఁడగునోయని వేదేవతలకు మ్రొక్కుచున్నాఁడు. అంత కన్నఁగానక బ్రతికిన మానసింగున కింతకన్న శృంగభంగ మే ముండును.

ప్రతా—సరియే! ఇవియన్నియు మనకనుకూలములే. కాని యింతతో ప్రతాపుఁడు సంతుష్టిపొందఁ జాలఁడు.

గీ. ఉదయపురమును సాధించి పిదప మాన
సింగు సాగరజీల నశింపఁ జేసి
తుదక పురుగుచు చిత్తూరు త్రొక్కకుండఁ
జేసినంగాని సుఖనిద్రఁ జెందుటెట్లు! 109

పృథ్వి—ప్రభుచంద్రమా! తమరిక నట్టి చిత్తాందోళన మూనఁనవసరములేదు. అట్టికాలము సమీపించియేయున్నది. సాగరజీ మానసింగులును సలీమును ప్రస్తుత ముదయపురముననే యున్నారు.

అమర—అయ్యలారా! నాకొక యాలోచన పొడకట్టుచున్నది. మానసింహుఁ డిపుడు స్వబలంబులతో మనరాజ్యములో నున్నాఁడుగదా! ఇయ్యదనున మనదళంబులఁ గొన్ని టివాని రాజ్యముపై కంపిన—

చ. మన మిపుడే రహస్యముగ మార్గమునం జముపూరుకోటలం
గొన మనసేనలం బరిచి కోల్తలసేసితిమేని మానసిం
గునకును బుద్ధివచ్చు కలక్రొవ్వడఁగున్ బలమూగు కుక్క కా
టునకును జెప్పుదెబ్బనఁ టుల్ సరిపోవును నాసిచేఁతకున్.

బాణ—దేవా! చిన్నవాఁడైనను చిరంజీవిచెప్పిన యాలోచన కనుల్లాఘనీయము. దేవర యనుజ్ఞ—

ప్రతా—అనుజ్ఞ కత్యంతరమేమి? చిరంజీవి రహాతూరుదళంబులతో జయపురదండయాత్రకు నేఁడే బయలు వెడలవలయును. పృథ్వీరాయలు నిజజ్ఞాతీనీసమూహముతో నిందే నిలిచి రక్షణ కొరకై దుర్గము రక్షించుచుండవలయును. క్షత్రియోత్తమ

యము మేమును శిశోదియాబలంబులతో స్వయముగా నుదయపురదండయాత్ర నడపింతుము. నే ప్రథమమే ప్రయాణము. ఈమా ఉదయపురదుర్గము సాధించి కాని తిరిగి రాఁ దలఁచుకొనలేము.

పృథ్వీ—రాణావారు సిద్ధసంకల్పు లయ్యెదరుగాక.

బాణ—ఆర్యా! పృథ్వీరాయా! అనుమానమేల? అప్పుడే మన యుదయపురము స్వాధీనమైనట్లే యెంచుకొనుఁడు.

మ. కదియ న్నచ్చిన శత్రులక్ష్మికి తద్గాత్రిస్రగ్భృన్మహీ
పదునౌ నాశరలేఖపఙ్క్తి వజయుక్తో ద్రావయించి పాపించు మీ
కిదె యాహ్వానపుఁ బత్రికల్ తొంగరండీ, పృథ్వీరాయా! జయా
స్పదుఁడైనట్టి ప్రతాపసింహుని జయస్తంభప్రతిష్ఠం గనన్.

పృథ్వీ—తప్పక వచ్చెదము. ద్విజకులసార్వభౌములగు మీమాట యోటగునా?

[తెరలో వందిమాగధులు.]

చ. ఉదయధరాధరంబున మయూఖసహస్రముతోడ నా యినుం
డుదితుఁడు గాకమున్నె రిపుయోధతమోహరణంబొనర్చు నా
యుదయపురీశుఁ డీతఁడు జయోద్ధతుఁడైన ప్రతాపసింహుఁ డీ
యదనున మేలుకొం డనికి నంపుఁడు వేఁ దెలుపుండు దండులన్.

ప్రతా—అదే! బాజారమున వందిమాగధులు బలముల మేలుకొలిపి దండయాత్రకుఁ బ్రయాణముహూర్త మాసన్నమైనదని తెలుపుచున్నారు. ఇఁక లెండు. సిద్ధము కండు.

అందఱు—(లేచి) మహాప్రసాదము. (అందఱు నిష్క్రమింపఁ దెరజాఱును.)



రంగము—ఉదయపురపుఁగోటలోని యంతఃపురము.



గులాము—(బాజారమునఁ బ్రవేశించి) అల్లా మాకీమంచిహాద్దృష్టమ్ ఖాసిసాబ్. ఎన్ని తంటాల్ వచ్చినా షాదిమాటా మీద్కియెక్కింది. మాచోటాషహ్జాద్ సలీమ్కి షాదిషా అయిషోతార్, షిల్లీతక్తపర్ వుంటాన్. ఆప్డూ మాకీ దేఖ్నానికి రెండూ కాదు. రెంబుల్లప్పుల్ రెండుఖోటుల్, మేళ్తాల్ వుండాల్లు. షెహ్జీషాదిపాసలీం

ఆదమీ పాసుహా గయా. ఎన్ని వున్నా క్యాఫాయిదా! నాకీ యింకా పూరా అఫ్సస్ పట్టింకిలేదు దిల్ పర్ ఏక్ బిచార్ సైతాన్కే మాఫక్ సంపాతింటూ వుంటూంది. చంద్రకళా మాకీ హాఫ్సుసంసే బీబీహైతో బహూత్ అచ్ఛా! ఎంతహాఫ్సుసం. ఎంత మానందం, ఎంత డాబూ, ఎంత డంబం, ఎంతనీమా, ఎంతజామా, ఎంతగోటూ, ఎంతనీటూ ఆ! ఇదే చంద్రిక కాయిద్దే ఆలోచన సేస్తూ సోఫాపర్ వుంది. ఇద్దావుండి ఏమియేమి ఆలోచన సేస్తూవుంది ఖాన్కీ మేముంటామే. (పొంచి వినుచుండును.)

చంద్రి—(వ్యాకులచిత్తముతో) ఆహా! సంప్రాప్తయౌవనయగు పువ్వుబోణి కభీష్టవరసమాగమునకు మించినయానందమును, అనిష్టపురుషసంధాన సమావేశ గోష్ఠులకు మించిన కష్టములును ప్రపంచమున నుండవుగదా? అబ్బా! ఎంతకష్టమెంతకష్టము. ఆఁడుదానికన్న నధమాధముండగు నీసాగరజీని కట్టుకొని నేను కాఁపురము చేయవలయునా!

చ. మగటిమి నిండుసున్న యభిమానవిహీనుఁడు మానసింగు దా
బిగువునఁ బిల్చి పెట్టినదె బిచ్చము వీనికి రూప మన్ననో
పగలు కనంగ రాత్రి కల వచ్చు నిరతుకుకుష్ఠి సాగ్రజీ
వి గలిసి కాఁపురంబు వలెనే వెలిగింపఁగ నంతబేనే. 113

ఇటువంటిదియేగదా యింతబ్రతుకు బ్రతికి యింట్రిముందఱఁ జచ్చుట! ఛీ! ఛీ! ఆసాగరజీ పేరెత్తిననే నా కొడలు మండుచుండును. నే నానీచు నెంతమాత్ర మంగీకరింపఁజాల. అవల మానసింగునకే కోపమురానీ; అక్బరే యాగ్రహింపనీ! వారెవ్వరువచ్చినారే వానితోఁ గాఁపురము చేయువారలు. కాన నిఁక నామదేవుఁడేయాన! జయసింగునే వరించుదాన.

తే. గీ. కూన జయసింహునే జతఁగూడవలయు
లేనిచో బ్రహ్మచర్యంబె పూనవలయు
పులుపుపండ్లెన్ని తిన్నను ఫలముగలదె;
తియ్యమామిడి పండొందుఁ దినినఁజాలు! 114

గులాం—(తనలో) అచ్ఛారే! ఈ చంద్రిలంజా కద్మాల్లో యెంతఘుట్టియాలోచన వుందిరా! ఇద్రా దీని దొంగతనం భయటెట్టిస్తాహ్ అని బెయంపెపె మాకీ మంచిలాభంవస్తాది! ఆ! ఇంకాయేదో యేకో అంటూవుంది.

చంద్రి—హా! జగన్మోహనమూర్తి! జయసింహకుమారా! కందర్పసుందరాకారా! మారా! నాకొక్కమాటు నీకౌఁగిలి దయచేయరాదా! ఇదేచేతులుచాపుకొని నిన్ను దిమిప్పట్టుకొనుటకై యెదురుతెన్నులు చూచుచుంటినే. ఆ! వచ్చితివా! రమ్ము రమ్ము! రయమ్మున నీకౌఁగిలియిమ్ము. (అని చేతులుచాఁచి పరిభ్రమించుచుండఁగా గులాము చేతులసందునుండి దూరి ముద్దుపెట్టుకొనఁ బోవును.)

చంద్రి—(దూరముగానేగి) ఛీ! ఛీ! దూర్తా! ఎవ్వఁడవురానీవు!

గులాం—మేము యొవర్ నీకీమాలుమ్నహీ! చోటాసర్కార్ సలీంకే ఖాస్కా వజీర్ గులామ్ మసూర్ద్! మాలుమ్హై! అవ్! అవ్! అలింగన్ దేవ్.

చంద్రి—ఓరోరి తాగ్రుఁబోఁతా నీకింత తలపొగరేలరా! కనులు నెత్తికెక్కినవా! మానసింహునితోఁజెప్పి నీగుద్దు ల్లాడఁబెఱికింపకున్న నే చంద్రికళ నేకాను.

గులాం—మేరేబాత్ సునో సెంద్రికళా! గుస్సా అయిపోతే క్యాఫాయిదా? ఒకొక్కముద్దూ మాకిదేవ్. పర్వానహీ. ఇక్డా యెవరూ లేరూ! ఎవర్కీ సెప్పేది లేదు.

చంద్రి—ఓరీ! దున్నపోఁతా! నీకు ముద్దుకావలయునా?

పాట—ఏకతాళము-సంభాషణ.

చంద్ర—దురితమతీ! త్వరితగతిం దొలఁగుర! నీకిప్పుడే॥ త్వరితగతిం దొలఁగురా! గుఱుతుగలిగి మెలఁగురా! తలపొగరా! వలపుటెగుప! తలకుమించి పరువులెత్తఁ దగురా! తెగురా నీతల॥ దురిత॥

గులాం—వగలాఁడీ! తెగనీల్గకె! పొగరుమటలాడకే! పొగరుమాటలాడకే! వగలుమిగులఁ జూపకే! మగనాలవె! తెగనీల్గెదు! మగఁడొకఁడటె వెలయాలికి! మూడలిడినవాఁడె మగఁడు॥ వగలా॥

చంద్ర—జ్ఞానహీన! ఇంకనీ! హీనబుద్ధిమానవా! హీనబుద్ధిమానవా! యింతకన్నుగానవా! మానవాధమా! యిఁదెల్లమానసింగుతోడఁ దెలిపి! మన్నాకావింతునీకు॥ దురితమతీ॥

గులాం—తొత్తా! అమానసింగు గుత్తచేసెనే నిన్ను! గుత్తచేసి

వాఁడఁటే ! పుస్తెగట్టినవాఁడఁటే ! చిత్తిని సీయెత్తులన్ని చిత్తం
బున కెక్కనేమి ! చేయించెదనో చూడుము ॥ వగలా ॥

చంద్రి—ఛీ ! ఛీ ! అర్ధరాత్రిమున రాణివాసమునఁ బ్రవేశించి మానభంగము చేయ యత్నింతువా ?

గులాం—క్యా ! క్యా ! సానీదాన్కి రాణీవాసం. మానాభంగం. ఎంతవింతసమాచార్ ! ఆవ్ ! ఆవ్ ! జాస్తీగడ్‌బిడ్ నేస్తే నీవింతదాకా సేస్తావున్న ద్రోహం దురాలోచన్ అంతా మానసింగ్కి సెప్పేయేసి నీప్రాణం తీయించి యేస్తామ్. దగాఖోర్ జయసింగ్కి పట్టుకారయెగిసి పోడాన్కి నీకీ వుద్దేశం. కంచెనీవాలా ! సాగర్జికి దగాసేసి మానసింగ్ కట్లో పట్టీమెయ్యడాన్కి తల్చి వున్నావ్ హుండు. హుండు. నీగుట్టూజట్టూబయల్ సేస్తామ్.

చంద్రి—(తనలో) అయ్యో ! ఈదుష్టుఁడు నాదుస్తంత్రమంతయు వినియున్నాఁడు. వీని నింక బ్రతుకనిచ్చిన నాకొంపతీయును. (పైకి) ఓరీ ! త్రాగుఁబోఁతా ! లేనిపోనిమాటలాడు నీనోటికి కిదేబుద్ధిచెప్పెదఁ జూడము. (కొట్టఁబోవును.)

గులాం—(తిరిగి కొట్టఁబోయి) రా ! రా ! ఆడదాన్కి నవం ఒలం మాకీలేకపోయిందిలేదు. (ఇరువురు కలఁబడి యల్లరిచేయుచుండఁగా చిత్రకారిణీ వేషమునయున్న కమలాబాయి ప్రవేశించును.)

కమలా—అర్ధరాత్రిమున నంతఃపురములో నీయల్లరయేమి ? (ప్రవేశించి చంద్రికతో) ఏమమ్మా నీకేమి మతిపోయినదా ! ఆగులాముతో చేయి చేసికొందువేల ? ఒకవేళ వాఁడు మతితప్పి తప్పుడ మాటలాడినను వానిని సమాధానముచేయుట నీపని. హుజూరునౌఖరులతో విరోధపడిన చాల ప్రమాదమని యెఱుఁగవా !

చంద్రి—ఎంతకనియోర్తునమ్మా వీనిత్రాగుఁబోఁతునడకలు ! చెప్పకొనుటకు సిగ్గు ! నేను వానినిఁ బెండ్లిచేసికొనవలెనఁట ! ఎంటివా వీనిచేటుకాలము !

కమలా—సరే ! నేను వీనిని సమాధానముచేయుదును. ఇంతలో నీవు లోనికేగి (రహస్యముగా) మోహినిదుస్తులు, వస్తువులు ఏమైన నున్న సంగ్రహింపుము. వానితో [illegible]. తప్పనిసరియొకటి యున్నది.

చంద్రి—సరే ! ఇదెంతపని ! అలాగున నే చేసెదంగాని పోయినపని యేమైనది ? కార్యము పండా ?

కమలా—హుష్. ఇప్పు డామాటెందుకు ? ముందు నేఁ జెప్పినపని చేసికొనిరమ్ము.

చంద్రి—ఇదే ! ఈపాటున. (పోవును.)

కమలా—గులాం! ఇటురా. ఇప్పుడు మీయిద్దఱికి జరుగుచున్న ప్రసంగమంతయు నే వింటిని. నీవు నన్నెప్పుడు చూచియుండలేదు. పాదుషా కార్యముమీఁద నే వేషుఁ గనవచ్చితిని. ముందుముందు నాసంగతి నీకుఁ దెలియఁగలదు. ఈ భోగ పుఁదొత్తు నీతో నిప్పుడింత పెట్టుచేసినదిగదా! నేఁజెప్పునట్లు వింటివా యీ రాత్రియే యిది తనంతవచ్చి నిన్ను బతిమాలుకొనునట్లు చేసెదను.

గులాం—అంతకన్నా మాకేయింకా యేమిహావృత్తం పట్నాలా! తల్లీ ఆలానేస్తే మీరుసెప్పినట్టా యింటాము. మీపాదంకొట్టి ప్రమాణంసేస్తాము. (కాలుపై చేయివేయఁబోవును.)

కమలా—(దూరముగాఁ దొలఁగి) అల్లరచేయక మెల్లఁగా మాట్లాడు. ఇవే జయ సింహుఁ డుండు చెఱసాలతాళములు. వీనింగొని యిప్పుడే నీవచ్చటికిఁ బోయి నీదుస్తులు వానికిచ్చి వానిదుస్తులు నీవు ధరించి జయసింగువలె నటించుచు నందుండి వానిచే నాకీ తాళములు మగుడ పంపించవలయును. చంద్రికళ వచ్చి యెంతబతిమాలినను నీవు పెదవి కదుపరాదు.

గులాం—అమ్మో! ఇదీబడేతేఁటా! జయసింగ్ మావీబాత్ యింటార్?

కమలా—భయములేదు! నేనంతయు నిదివఱకే యేర్పాటుచేసితిని. జయసిం గును మనపక్షమువాని విడదీసియుంటిని. లేకున్న నాకీతాళము లెట్లువచ్చును! ఏమో యిందులో నీకుపకారము చేయవలయునని యాలోచించితిని. గులాపు బుద్ధియగుటు నీవనుమానించుచున్నావు.

గులాం—సై! సై! తల్లీ! మీరూసెప్పినట్టూ సేస్తాము. జేవ్. దేవ్. (అని తాళములు పుచ్చుకొనును.)

కమలా—ఇదిగో! ఘతియొకమాట. అచ్చటి ఘారావా రనుమానింపకుండ జయసింగు నకు చోటాసర్కార్ వద్దనుండి యుత్తరము గొంపోవుచున్నానని చెప్పుము. లేదా వేటొకమిష చెప్పుము.

గులాం—అచ్ఛా! అచ్ఛా! అంత్యా బడేహుషార్సే సేస్తామ్ (పోవును.) (చంద్రికళ మోహినిదుస్తులతోడను నగలతోడను బ్రవేశించును.)

చంద్రి—ఏఁడీ గులామ్? ఆపిశాచము వదలిపోయినదా?

కమలా—పోకయట్లేయుండునా! వచ్చుఁజెప్పువారిలో నున్నవి.

చంద్రి—చిత్రకారిణీ! ఏమైనను నీ వెంగమునందు వశీకరణమహాత్మ్యొక్క టిం యున్న దమ్మా లేకున్న నెట్టివాఁడైనను నీకు లోఁబడిపోవులేల? పిదపెట్లున్న, అతఁ డెచటి కరిగెనో?

కమలా—నేఁజెప్పుటయు నంగీకరింపకుండుటయునా! కాని మఱొక్కమాట. అతనిని కారాగృహప్రాకారము దాఁటించువఱకు నీవు మోహినీబాయివలెనే నటింప వలయును. అతఁడొకవేళ మాటాడకున్నను నీవనుమానింపఁగూడదు. అతఁ డనుమానముచేఁ దురకవానివలె నటించును. నీవుమాత్రము పొఱపడకుమా! జాగ్రత్త! మోహినివలె నీవు నటించుటలో నున్నది.

చంద్ర—మోహినివలె నటించుటకేమిలే! ఆమె యాకారము నాకెచ్చటనుండి వచ్చును?

కమలా—ఇదిగో! చూచుచుండుము. నిమిషములో నిన్ను మోహినింజేయలేకున్న నావిద్యయేల? రమ్మ! నాముందుకూర్చుండుము. నిన్ను మోహినిగా మార్చె దను. తలలు మార్చుటలో నిన్నును రూపము మార్చుటలో నన్నును మించిన వారు లేరు. నిన్నెందుకు లెమ్మంటిననుకొంటివి వీవస్తువులు. (చంద్రకళ తన ముందు కూర్చుండ కమలాబాయి మోహినీబాయివస్తువు లామెకు శృంగారించు చుండును.)

చంద్ర—చిత్రకారిణీ! ఆమోహిని కింత యవమానబుద్ధియేల! నాట్టినుండియు నామె వైఖరి చూచుచుంటివికదా!

తే. గీ. ఏను జయసింహుఁ డనఁగఁ జెల్లించు మోహము,
కోర నే వానిఁ గన కనుల్ కుట్టుకొనును
తాళిఁ గట్టిన మగఁ డోటు? తనకతండు
మోహినికి నింత యవమానబుద్ధియేల? 115

కమలా—అది స్త్రీలకందఱకు సైజము. క్రొత్తగా నన్నడిగెదవేల? ఏకఫలాపేక్ష—ఇదిరొ తెంగిరొయేకదా నీకు మోహినివలె మస్తీబుచేయుచుంటిని. ఇప్పుడద్దము చూచుకొమ్మ.

చ. అలకల నంగరాలవళు లట్టులు ఫాలము మీఁదిఁ యుంచునన్
మలికలు చట్టితిం బొమలు సీటుగ నెత్తి తిమ్మి గులాబిరే
కుల కలపమ్మొసర్చి ఇదిగో తిలకమ్మును గొప్పఁబెట్టితిఁ
బాలతిరొ విల్వ్యాటద్దమదె! మోహిని పో మఱికావా చన్గానక్షో.

చంద్ర—(నిలువుటద్దము వొద్దకుఁబోయి తనక్రొత్తము స్తీబు చూచుకొని) ఆహా! ఎంత నేర్పరివమ్మ నీవు! నాయీక్రొత్తరూపు నాకే మరలఁ గొఱుతుచున్నది. నా

కన్నులు నన్నే భ్రమింపజేయుచున్నవి! ఇఁక నాజయసింహుని శక్యఁగాను ఓకొక లెక్కయా!

తే. గీ. నెలత! శిల్పకళ ల్నీకు నేర్పుఁ జూపి
చిటికెలోన నన్ను మోహినిం జేసితిగద!
వలపువిద్దెల నాకున్న పొలుపుఁ దెలిపి
చేరి జయసింహు మోహిని జేయలేవె!. 117

కమలా — ఓ! తప్పక చేయఁగలవు! మోహినికిఁ బలె చీరకట్టు నీకింకను నేర్పవలసి యున్నది. పోదుమురమ్ము.

(ఇరువురు లోనికిఁ బోఁగా దెరజారును.)



రంగము — అంతఃపురము.



[మోహినీబాయి యొకమంచముపై విశ్రమించియుండును.]

మోహి — (తనలో) ఆహా! నాదెంతయదృష్టజాతకము! ఈయదృష్ట మొక్కనన్నే కాదు నా గాలిసోఁకినవారినెల్ల చుట్టిచుట్టి కొట్టుచున్నది.

ఉ. తల్లియుఁ దండ్రియు న్విడువఁ దాతయొ త్రాతయు నేతయాకా మన
న్నెల్ల విధంబులం బెనిచె; నేమిసుఖించె నతండు! దుంఖపుం
వెల్లిమునుంగునన్ను మనిపెం జయమల్లు సుతుం డితండు నా
వల్ల భుజించె నేమి! చెఱపాటెగదా! బ్రతుకేల నా కిఁకం. 118

కావున దురంతములగు చింతలకాకరమై, ప్రపంచమునకు భరమై, మేలుచేయవచ్చిన వారికెల్ల మహోపద్రవకరమై, కరము నసహ్యకరమైన యీకళేబరము నీధరాతలము నుండి యెంతత్వరితముగాఁ దొలంగించిన లోకమున కంత మేలుచేసినదాననగుదును. ఓపంచభూతములారా! మీకొక్క చిన్నవిన్నపము. అనాయాసముగాఁ బంచత్వము నొందు వర మొక్కటిమాత్రము నాకనుగ్రహింపుఁడు. సద్వినియోగము చేయుమని నాకు మీరనుగ్రహించిన మీమీగుణములను శక్తులను క్రమ్మఱ గ్రహింపుఁడు. నావలె మంచేసిన మీమీసొత్తుల నిదివఱ కెట్టి దుర్వినియోగము చేసి యుండలేదు. ఏదియైన చేసిన దోసంగు లున్న మన్నింపుఁడు. ముక్తి ననుగ్రహింపుఁడు.

మ. పుడమీ! నీయొడి సుంతచోటిడుచుఁ గొంపోరావె నన్వేగ, సూ
ర్యుడ! వేఁజేతుల వేడివేలుపుర సీఱుం జేయ లేవే నను౯,
పిడుగో భూతమొ పంపి నన్నడుప లేవే నీవు నాకాశమా!
కడలీ! నీకు నసహ్యమా? కరువలీ! కానైతినే నీకును౯. 119

తల్లీ! భూదేవీ! నీవత్యంతశాంతమూర్తివని చెప్పుకొందురే! నన్ను నీకడుపులోఁ బెట్టుకొని నాకడగండ్ల నడగింపరాదా! ఓ సూర్యభగవానుఁడా ? కర్మసాక్షివగు నీకన్నుఁ గప్పి నేనేమిపాపకర్మములు చేసియుందును! కన్నెను విపన్నను. ఏపున్నెము నేపాపము. నెఱుంగను. నన్ను లోఁగొనరాదా! నిఖిలలోకపావన జీవనప్రదుండవగు నో జీవనదేవా! వరుణా! నిరంతర కరుణాతరంగితాంతఃకరణా! ఎట్టియపాత్రులనైన స్పర్శమాత్రనే పవిత్రీభూతులంజేయఁ గంకణము ధరించిన ఘనులలో నెల్లఘనుండవుగదా నీవు! నామనః పంకేరుహమును మిక్కిలి బింకముగా నంకించుకొనియున్న యీవ్యాకుల పంకంబు నింకించి నిష్కళంకంబుగాఁ జేయనేరవా! వాయుదేవా! నీవు వ్యాపింపలేని తావేలేదే! అధికారపిశాచావేశ పరవశులైన యీనరపశులకంటఁ బడకుండ నన్నెందేనిఁ గొంపోరాదా! ఎందుకు మీగండలు సందేహించెదరు! మీలో నొక్కరికైన నేనక్కఱకు రానిదాననైతినా!

[అంత సలీమ్ ప్రవేశించును.]

సలీం—(తనలో) అచ్ఛా! అచ్ఛా! మంచిహావకాశం సిక్కింది. ఎహీవఖత్ మే చెమక్సే మొలాఖత్ సొసాయింపుసెయ్యాల! కేవలం మెహర్బానీ కాకుండా, గుస్సాచేయకుండా, అఫల్ సూప్సేసి, అనురాగం కాప్సేసి గుల్సబ్ పూర్మే మహామ్కీమఖీ కైసె పానంసేసినట్టూ బెట్టూసేసీ పెయ్యకుండా, ప్రియం సూపీ సూపకుండా, భయం సెప్పీ సెప్పకుండా, నయం, భయం, దయా, హౌసల్, డాబూ, దర్పంసూపీ స్వాధీనం సేస్కోవాల. (మోహినిని సమీపించి పైకి) మేరేప్యారీ! మోహినీ! జహాన్మోహినీ! ఢిల్లీపాదిషానీకీ దౌలత్ కీ జోహార్ సెప్తావున్నారు.

మోహి—(ఉలికిపడి స్తబ్ధయై యూరకుండును.)

సలీం—ఉలాకైసై. పలాకైసై. ఉక్కర్ వాలా బెకూ సేనూవుండి: మోహినీ మేరేప్యారీ! [illegible] క్యా! ఢిల్లీ పాకీ స్వాధీకర్త్రీ! నీకీ [illegible] జహాపిరీ [illegible]

మోహి.—(సలీమునుచూచి తనలో) అక్కటా! తలఁచుకొన్నంతయుం జరిగినది యిఁక నాకు దిక్కేమి?

సలీం—ఆ! ఆ! మాకేసీ నూస్తూవుంది. తోడాతోఁతా మాసంగీతకం మజానూప్రతాం.

పాట—ఏకతాళం.

మేరేపిత్రియప్యారీ! మనునికటారీ!॥ ఏరీ! నీనకీయెవ్వా రీ జహార్మె లేరూఁగదేసుంవరీ! మొహామెత్తి మాకీచూాను! ముద్దిచ్చి మాటలాను! మొహమాట మింక నేల! మోహినీ రోహినీ! జోహార్ కంబుకంధరీ! మేరే॥

మోహినీ! మొహమాటంతాని పద్దాతీసియేసి మాకీ మంచిమాటా సెప్పు. ఢిల్లీకిపట్కా యెల్లి నీవీళరీరం దరోబస్తు జరీతగాప్రిసాలామలామాసేస్తామ్. కాళ్ళకీ, సేతుల్కీ, గల్లాకీ, సెవుల్కీ పక్కారకం రతన్ సహ్యాతాపటుం సేస్తాం. ఏవీ! ఏవీ! హమాక్కా ముద్దూమాకీయిస్తే జాస్తీబాత్ క్యా ఢిల్లీసామమామాపేహాస్తం నీపీహామ్ పకడ్ సేసి మం చీగౌరవమ్ సేస్తావీ. నైతో జులుంసే బలాత్కారం సేస్తావీ.

మోహి.—హా! భక్తజనకల్పవల్లీ, సతీమతల్లీ! తల్లీ నాకిఁక నేమిదిక్కు!

శా. తల్లీ! పల్లను చేతఁ జిక్కితిఁ బ్రమాదంబేమి వాటిల్లునో
తల్లిందండ్రియు నీవె యొండెఱుఁగ నేతప్పొప్పులంజేయు నా
పుత్రే రెవ్వరుఁబోవ నార్తజనబంధూ! సత్కృపాసింధు! నీ
పిల్లం గాళ్ళను జుట్టుకొంటి నిదె దేవీ! యేమిగావింతువో!. 120

సలీం—క్యా! క్యా! ఎంతనిదానంసేస్తూవున్నా సవాల్కీ ఠీక్ సమాధానం మాని రోదన్ సేస్తావ్? నీకీగౌరవం బేగౌరవమ్ మాలుమ్‌నహీ. రాజారాజ్ మేము ఖుద్దునవచ్చి పాణిధేయంపడ్డూవుంటే కిస్కూర్ మన్కా సోఫాపర్ యెక్కి కూర్కా సేస్తావ్. ఏవీ! మాకీ తోడాజాగా సెయ్యి. (సోఫామీఁదఁ గూర్చుండును.)

మోహి.—(చప్పునలేచి దూరముగాఁ జని)

కవిరాజవిరాజితము.

తొలఁగుర! యెవ్వరుతోలిరి నిన్నిట! దూరముగాఁ జను దుష్టమతీ!
తలఁపొగరా! కలుడాపివితివా! మతిదప్పిన పేల్రెదు తప్పునుడుల్!

నిలువకు మియ్యోడ! నీచెలియెవ్వరో నీచపుబుద్ధులు నేరిపి నిన్
వెలియుక పంపె నదే చనుమార్గము! నిల్చితివా మరణింతువురా!
ధూర్తా! లేచి దూరముగాఁ బొమ్ము! లేనిచో నీకుఁ దగినశిక్షఁ జేయింతును.

సలీం—హోయిరే హాయి! మంచిమాటా సెప్పినావ్. మాకీశిచ్చా సేస్తావ్ కాదూ! హామేషా మేమూ నీదిశిచ్చాలో వుండిపోడానిక్కే మాకీసంకల్పం. (మఱింత దగ్గఱగావచ్చి)

పాట—ఆదితాళము.

నికాకరో సుందరీ! బుకాయింపు నకో నకో ॥ నికా॥
రకారకం రత్నసరక్ । ముకామల్ ముస్త్రీబు నజర్
జొకాయించి పట్టుతామ్ । పకాపకా నవ్వేమాకి ॥ నికా ॥
చారుఘోషా గాడిమేషి । కాను నీకి రోజురోజూ
దేరీక్యా మోహీంని । తేరిచూంమ సిగ్గు ఏకు ॥ నికా ॥

(మీఁదికివచ్చి ముద్దుపెట్టుకొనఁబోవును.)

మోహి—(తనలో) త్రాగినవానికిఁ దగవేమి? ఇఁక వీనితో సామమువలన ఫలము లేదు. (పైకి) ఓరీ! ధూర్తా! ఎంతచెప్పినను బుద్ధిలేదేమిరా!

చ. తగదని యెంతచెప్పినను ద్రాఁగుడు బుద్ధులు మానవేర! ధూ
ర్తగుణ! తొలంగిపోఁగదరా! తెగవైతును బోవకున్న నా
దుగురుసితాసి నీకుణమె తుండెమొగిం దెగి వింతబంతి మా
డ్కి గిఱగిఱన్ శిరంబెగిరిపోన్ చదలం జెయివేసు మొంటిపై.

(గుప్తఖడ్గము నొఱనుండితీసి మీఁదికి వచ్చును.)

సలీం—(వెనుకకుఁ దగ్గి) అబ్బో! అబ్బో! బడేషైల్మాన్‌వాలావుంది. అరే! గులాం. అరే! సిద్దీరాం! జల్దీఆవ్ దీని కాలూ సెయ్యీకట్టియేసి మా మహాల్కి పట్కారా! అక్డావీన్కి తగినబుద్ధి సెప్తామ్. (అని పోవును.)

మోహి—ఈత్రాగుఁబోఁతు తన పరివారముందోడు తేర నరిగినాఁడు. అసలే గోవా శ్మశు మెనఁగాడు ఆమీఁద త్రాగినాఁడు. అధికారముగలవాఁడు. నేనో సంప్రాప్తయౌవనను నాఁడుదానను. దీనను. సహాయహీనను. సమయమున కా [illegible] పాలం బడిపోయెను. త్రితాపుని యుదంతములు తెలియ

పాయెను. తండ్రికభిమానములేదాయెను. అర్ధరాత్రము. శత్రుమధ్యము. గత్యంతరములేదు. మానరక్షణకు ప్రాణపరిత్యాగముకన్న వేఱొండు వెఱవులేదు.

జయ—(గులాంవేషమునఁ జైకివచ్చి) ఇదే! మోహిని కలకదేఱి యేమో యాలోచించుచున్నది. కనుపడకుండ నిచ్చట నుండియే యీమెప్రియత్న మేమియో కనుఁగొందుంగాక. (పొంచి వినుచుండును.)

మోహి—(కత్తిమొన తనవంకఁద్రిప్పి) ఓ నాగుప్తఖడ్గమా!

చ. అదనునఁ బ్రోవ బ్రాణసఖవై ధృతి నిల్పఁగ నంగరక్షవై
మదరిపులం వధింపఁదగు మారణమంత్రమవై సదా ననుం
వదలకయుంటి వోటినెడఁ బాయక నేఁడిటు తప్పి వచ్చి, నా
హృదయముఁజీల్చి మానరము నిల్పుమిఁకన్ సెలవిమ్ము ఖడ్గమా!

(అని కత్తిఁగొని గుండెపైఁ బొడుచుకొనసిద్ధురాలై) ఇఁక నొక్కసంగతి మఱచితోయితిని. ఓ సింహవిక్రమా! జయసింహకుమారా!

చ. మెలకువతో ననుంగనిన మేలునకున్ ఋణమే లొసర్పగాఁ
దెలియక నీకు నప్పవడితిం జయ! ఈభవమిట్టులౌటఁ; రాఁ
గల భవమందు నేని కలకాలము నీమృదుపాదపద్మముల్
గొలిచి ఋణంబుఁ దీర్చుకొనఁ గోరెద నిప్పటికిం క్షమింపుమీ.

సరే! ఇఁక నన్నియవశిష్టములుఁ దీఱినవి. ఓ యసిపుత్రికా! నీవే యీమందభాగ్యురాలికి శాశ్వతానంద సంధానకారిణివి. (అని గుండెపై పొడుచుకొనుచుండును.)

(గులామ్‌దుస్తులు ధరించియున్న జయసింహుఁడు చప్పునవచ్చి చేయిపట్టుకొని)

జయ—మోహినీ! సాహసముమాను. సాహసముమాను.

మోహి—అయ్యో! చెడితినిగదా! ఇఁక నేమిగతి?

భుజంగ. దురాచార! దుష్టాత్మ! దూరంబుగాఁ బో
వరా! లేనిచో నీదుప్రాణంబుఁగొందున్.

జయ— వరారోహ! ఘోరంబు వారింపుమా నే
తురుష్కుండఁగాఁ రాట్సుతుండన్ హితుండన్. 125

సుందరీ! భయపడకు! నేజయసింహుఁడ (గులాము వేషము దీసివైచి నిజరూపముఁ జూపును.)

మోహి.—(చప్పున కత్తిపాఱవైచి కేలోడ్చి) మిత్రరత్నమా! క్షమ్యాస్మి! క్షమ్యాస్మి! ప్రాణమిత్రమా! గర్భశత్రులందైనఁ దలంపరాని మహాపరాధము నేను మీ యెడలఁ గావించితిని. అట్టి మహాపాతకిని, అట్టి మిత్రద్రోహిని నగు నా మొగము మగుడ మీరేల చూడవచ్చితిరి?

జయ.—సుందరీ! పాపము నీవేమిజేసితివి? ఇప్పుడు మనకువచ్చిన ప్రమాదమేమియు లేదు. నీచిత్తము స్వస్థపఱుచుకొమ్ము.

మోహి.—ప్రమాదమేలేదా, బ్రతికితి. మిత్రరత్నమా! శత్రుమధ్యమున నున్న మనకుఁ బ్రమాదము లేదందు రెందుచేత? పరిపంథికుంభి కుంభస్థల విదారణ దారుణ నఖాగ్రంబగు కొదమసింగపుంగొదమ విధివశమునఁ బంజరమున బంధింపఁబడి యె. దురాచారదవానలంబు నల్దట్టులఁ జుట్టుముట్టి తెక్కలురాక నడుమఁబడి యున్న దిక్కుమాలిన కపోతపోతంబును గాల్చివేయుచున్నది. ఇంతకు మించిన ప్రమాద మిఁక నేమున్నది!

జయ.—సుందరీ! శాంతింపుము. మనమిప్పుడు ప్రమాదతరంగిణిందరించి దరిదగ్గతితిమి.

మోహి.—అసహాయశూరులగు మీరు సమీపించినంతనె ప్రమాదములన్నియు దూరములగుననన్నమాట నిక్కువమే కాని—

జయ.—కాని నాకింకను బంధవిమోచనము కాలేదని కాఁబోలు నీయర్ధోక్తి.

మోహి.—అదియైనది. ఇంక నాసంబంధమగు బంధమిదియొకటున్నది కదా.

జయ.—ఎన్నఁడు నే నీబంధవిమోచనము మాత్రము వాంఛింపను.

మోహి.—బంగారుదైనను సంకెల సంకెలయే. మనలోమాట– మీరిట్టిగులాము వేసమూనతేల? అదియేమి? తిరిగి యావేషమే వేయుచున్నారు వద్దు. వద్దు. (గులాము దుస్తులు తీసికొనఁబోవును.)

జయ.—ఈవేషమే యాబంధమోక్షమునకు గురూపదేశము. శ్రీవిద్యోపాసన. ఉండనిమ్ము. ఇంకను దీనితోఁ బనియున్నది. (వారించును.)

మోహి.—ఆస్త్రీ యెవ్వరు? చంద్రకళయా?

జయ.—కాదు. చంద్రకళకు మారణదేవతయగు చిత్రకారిణి.

మోహి.—ఆచిత్రకారిణి యెవ్వరో ఆమెచరిత్రము కడువిచిత్రము.

జయ.—మన బంధువర్గములోనిదే. మనకు సహాయముచేయుటకే వచ్చినది. వివరములు [illegible]

మోహి.—నే నట్లే యూహించితిని. మనవా రింక నెందరున్నారు?

(తెరలో)

ఉ. శత్రులు కోటలోఁ దిరుగసాగిరి వేగుఁ గనంగఁ బెక్కులౌ
కృత్రిమరూపముల్గొనుచు నీక్షణమాదిగఁ గోటలో హుంకుం
పత్రిక లేక యేరి వెలుఁపంజన దాపుఁడి రాత్రిపోఁకలన్
చిత్రగతి న్స్వపక్షతతి చేయు పను ల్గనుఁ గ్గి చూడుఁడీ! 126

జయ—వినుచుంటివా! దుర్గరక్షకుల హెచ్చరిక. ఉండుముండుము. మఱియేదో విన వచ్చుచున్నది.

(తెరలో) ఓ దుర్గరక్షకులారా! భద్రము! భద్రము!

ఉ. కందక మందు నీర మధికంబుగ నింపుఁడీ; కేళ్ళిరంగులన్
మందుఘటింపుఁడీ! రిపులమార్గములం గన కోటగోపురా
లందగు దూరదర్శనుల లక్ష్యముఱ్పుఁ డదే ప్రతాపసిం
గిందుల కేసు జెంచెనఁట యీపెనజెబ్బులి కైపడి స్వశిన్. 127

జయ—సుందరీ! ఇఁక తడవుసలుటకు నాకు వీలులేదు. శత్రువుల యుత్తరువుల వినుచుంటివిగదా! మున్ముందు వీరిమందుగుండు సామాను నాశముచేసినఁగాని మనకు సాధ్యులుకారు. ఏమి? రిచ్చపాటును పరధ్యానమును నీమోమునందుఁ గన్పట్టుచున్నవి!

మోహి—ఏమియులేదు. నిశ్శబ్దముగానున్న యీయర్ధరాత్రమునందల్లదే యుదయపురము పుట్టినిల్లుగాఁగలయొక వానకోయిలకూఁత వినవచ్చినది.

జయ—ఆచాతక మేమనుచున్నది?

మోహి—జీవనాతురయగు నాపక్షిజాత మేమనఁగలదు! కుహూకుహూమనియో కహూ కహూమనియో.

జయ—పాప మాశాభంగమైనది కాఁబోలు. ఏజాతియైననేమి? బాధ సహింపరానిది గదా!

మోహి—నిజమే.

చ. కడు వడగాడ్పుచే నొడలు గాసిల వేసరి వానచిన్కకై
బడలి తపించు చాతకము పంజోదపంబిఁక వర్షబిందువుల్

పడఁగలిరో లభించు నని వచ్చినమేఘుని గాంచిపొంగఁగా
పిడుగుపడెఁగదా యెటుల బిట్టువగన్మది మట్టిపెట్టెదన్. 128

జయ — సుందరీ ! ఎందుకీయన్యాపదేశములు ! నిరంతరము యుద్ధమే జీవనముగాఁగల మాయట్టివారి పుట్టువెల్లపుడు నిట్టియాశాభంగములనే కలిగించుచుండును.

చ. పొడుపొడు! లెమ్ములెమ్మదిగో పోయెను బోయెనరాతిసేన! వె
న్నడు! నిలు! తగ్గు! మొగ్గరముఁ బన్నుము నావిననాను శాంతియె
క్కడ? పడవాలుపుట్టుగడెగంతము, పోటరివంగడంబు న
న్నొడమితి నీకుఁదెల్పవలె నోచెలిరో పొలిసేఁపోకడల్. 129

ఏమిచేయను నావంటివానిజన్మము వ్యర్థము ! నిరర్థకము !

మోహి — అట్లనుట ధర్మమా ! నేనంతతెలివిమాలినదానవా !

ఉ. స్వార్థపరత్వమన్నది రవంతయులేక సతంబు దేశసే
వార్థము గడ్డిపోచవలె నర్థము బ్రాణము ధారవోయుటన్
సార్థకజన్మ మాతనది, స్వార్థము మోధుని రాచబాట, హా
వ్యర్థమటంచుఁ బల్కసరియా! మరియాదలు నేనెఱుంగనా!

(మఱలఁ డెరలో)

ఉ. వచ్చెఁ బ్రతాపసింగు నిజవాహినితోడ నదేయుదేపురిన్
జొచ్చెడు రేపొమాపొ! యిటుసోమరులై నిదురింతురేల? ఓ
చిచ్చుపుజోదులార! రణభీరులు మీరలు రాజపుత్రులే
చిచ్చరనేప్రతాపములు? చేతులనున్నవి విండ్లొ? గాజులా? 130

మోహి — ఇదియేమి ? ఈహెచ్చరికతీరు! అశ్రుతపూర్వముగా నున్నదే!

జయ — ఇదివేఱు! మనశాణకవి ప్రయోగించిన భేదనోపాయమను శతఘ్ని. ఇఁక నొక్కగడెయైన తడయరాదు. నాకుసెలవిమ్ము.

మోహి — చిత్తము. పునర్దర్శనభాగ్యమెప్పుడు ?

జయ — ఎట్లు చెప్పనగు ? పోవునది యుద్ధభూమిగదా !

ఉ. ఆయువుగట్టి నేని సమరావనిలో రిపులన్వధియించి నీ
కై తొలిమిం గ్గొన స్వజయగర్వముతో జనతదెంతు రేపె తే

దా యశస్సీమ కీర్తనువు సర్వగా చేసి దివంబుఁ జేరి నీ
కై యట వేచియుండెద లతాంగి కొ! యచ్చపుబ్రహ్మచారినై.

మోహి—భగవదనుగ్రహము కలన మనకు శుభమే చేకూరుఁగాక.

జయ—మోహినీ ! ఇదే కత్తి! దీనిని బూజించి నీయాశీర్వచనము నాకు దయచేయుము.

మోహి—(పుచ్చుకొని ముద్దు పెట్టుకొని) ఓ శస్త్రరాజమా !

శా. మేలున్గెల్పు ఘటింప నేర్తువని మన్మిత్రుం డెవ న్నమ్మి ని
న్నేలంబూనుచు సంగరోర్వినయుఁ కన్నేఁగాచె నేలోటు దో
ర్లీలామగ్న మనస్కుఁడై తిరుగు చో లేకుండఁగాఁ జేసి యీ
యాలంబందున గెల్పు మాకు దయ సేయంజూడుమా శస్త్రమా.

జయ—(మోహిని దీవించి కత్తి యీయఁగాఁ బుచ్చుకొని నిష్క్రమించును.)

తెర జాఱును.





శ్రీ

# 'రాజపుత్ర తేజఃపుంజము'

## (రాణా ప్రతాప్ సింగు)



## షష్ఠాంకము.



### రంగము—ఉదయపురపుకోట-విష్కంభము

[వ్యాకులచిత్తముతో సాగరజీ ప్రవేశించును.]

సాగ—(ప్రవేశించి తనలో) ఆహా! ఎంతబుద్ధిహీనవాఁడనైతిని. ఆ కులభ్రష్టు మానసింగు నాకేమో శాశ్వతబ్రహ్మపట్టముఁ గట్టునను పుట్టెడాసతో పట్టరానివారి కాళ్ళను పట్టి, చేయరానిహీనకార్యములను చేసి, పడరానికడగండ్లంబడి తుట్టతుదకుఁ గడుపునఁబుట్టిన ముద్దుపట్టి మానధనము సహితము కులహీనుల కమ్మ చూపితి. దేశద్రోహిని, భ్రాతృద్రోహిని, ఆద్రోహముల ఫలమే నన్నిన్నిగతుల కట్టికుడిపింపుచున్నది. నిన్నటిరాత్రి మూఁడవజామున నామానసింగు సలీమును వెంటఁబెట్టుకొని బ్రతుకుజీవుడాయని యేదోవేసమునఁ గోటదాఁటి తనదేశమునకుఁ బాఱిపోయెనని కొందఱనుచున్నారు. మఱికొంద ఱింకేయేమూలనో తలదాఁచుకొనియున్నాడందురు. నేనిక్కడ కార్చిచ్చునడుమ మిడుతవలె శత్రుమధ్యమునఁ జిక్కియుంటిని. మాసేనలన్నియు భీభత్సములయ్యె. ఇప్పట్టున శరణాగతరక్షకుఁడగు మాయన్న ప్రతాపునిపాదములు పట్టుకొనుటకన్న వేఱొండుగతిలేదు. అదిగో! చాణకవి యెవ్వనినో బంధించి యిటుఁ దీసికొని వచ్చుచున్నాఁడు. వానికిఁ గనుపడకుండ నీమూలనక్కి యిప్పటికిఁ బదువుఁ దక్కించుకొనియెద.

[అంత బాణకవి మోహినీ జయసింహుల వేషములనున్న చంద్రికళను, గులామును గొలుసులతోఁ గట్టి తోడ్కొనివచ్చుచుఁ బ్రవేశించును.]

బాణ—(ప్రవేశించి) వంచక వంచకులారా! మీ రీవేషములు వేయుటకుఁగల కారణ మేమో యున్నదున్నట్లు చెప్పుఁడు. లేకున్న మిమ్మిక్కడనే నఱికివేసెదను.

గులా—మహారాజ్! ఈ సానీదానిమీఁది మోహాం మాకీయింత ద్రోహాం తెచ్చింది. టక్కర్ వాలా సితారికారిణీ నాకొంపాతీసింది. ఈయేమం యేయించింది. తక్సీర్ మాప్ మహారాజ్. మాకీ యిష్పిపెడ్తే మీ కాళీ ఘూలీ హూస్కొ కన్పడ్ కుంఠా ఘాలిలో సొంగిరిపోతామ్. యిష్పిపెట్టు మహారాజ్ యిష్పిపెట్టు.

బాణ—సరే! నిన్ను విడిచిపెట్టుటనుగుఱించి వెనుకనుండి యాలోచింతును. నీవు నాతోఁ జెప్పినదంతయు నిజమేకదా! ఓ చంద్రికళా! నీవీవేషము వేయుటకు హేతువేమి?

చంద్రి—నే నేమియు నిప్పుడు చెప్పఁదలఁచుకొనలేను.

బాణ—సరే! రాణావారి యెదుట విమర్శింపఁబడునప్పుడు చెప్పుముగానిలే. రండు. రాణావారి సముఖమునకు రండు. (తీసికొనిపోవుచుండును.)

(తెరలో జయసింహుఁడు డంకా మ్రోయించి)

శా. రండీ! మూఁతులమీసముల్ గలుగుశూరమ్మన్యులిందున్న దో
ర్దండప్రౌఢిని మాప్రతాపుని ధ్వజస్తంభం బుదేపూరు కో
టం డంకాపయి దెబ్బఁగొట్టి యిదె నాటంబోవుచున్నా నెదు
ర్కొండీ! యాపఁగరండి ధీరులగు వీరుల్ బీరమున్నట్టిచో. 132

(జయసింహుఁడు గులామువేషమున పయికివచ్చి) ఓ సాగరమానసింహ ప్రభృతులారా! శూరమ్మన్యా సలీం రాకుమారా! మీ రెవ్వరు నెదుటఁ బడరేల? (వైపద్యమునే తిరిగి చదివి)

ఇదియేమి? మానసింగుప్రభృతులు మాయమైపోయినారా!

సీ. వృద్ధుఁడౌరాణనుల్లు వివశుఁడై పడియుండ
వీ డరికట్టిన బింకమూఁచి
గుణములప్రోవు మోహినిశీల రాజాంబుఁ
బోఁద్రోల నెంచిన పూని కావి

చచ్చితి మీకొఁజాలు సంగరంబని భటుల్
కొనయూష్పగాడ్పు ముక్కాలనె పీల్చఁ
తనమాటనమ్మి కీర్తిని దొంగిలితిమని
విలపించుచుండఁ బృథ్వీవతాళి
తోడిమిత్రుల దుఃఖాబ్ధిఁ ద్రోసివైచి
యెందుఁజనె మానసింగు గన్పించఁడిపుడు
భైరవీమాత కిడె వాని బలియొనర్చి
దేశసంకట మింతతోఁ దీసివైతు. 133

బాణ—ఇంకను మానసింగెక్కడ? జయసింహా! అదియేమియావేషము!

జయ—ఎవరది! బాణకవిశిరోమణియా! నమస్కారము. ఏమంత్రిని? మానసింగేమయ్యెనో చెప్పఁడు. నావేషము మాటకేమి?

బాణ—ఏమయ్యెను? నిన్నటిరాత్రి మహావజాముననే సలీంరాకుమారునితో మాయమయ్యెను. ఇప్పటికి కోటలోఁ జిక్కిన ద్రోహులు వీరిరువురే. (గులాము చంద్రికళలను జూపును.)

జయ—వీరెవ్వరు? వేషధారులవలె నున్నారు?

బాణ—వీరును నీవలె వేషధారులే. వీరివృత్తాంతము వెనుకనుండి చెప్పెదను. రాణావారిదర్శనమునకుఁ బోవుదము రమ్ము.

జయ—సరే! అదియెవ్వ రాయూల నెవ్వఁడో నక్కవలె నక్కి నిక్కి చూచుచున్నాఁడు.

సాగరజీ—(అంత పైకివచ్చి చేతులుజోడించుకొని)

చ. శరణుమహాత్ములార! ననుసాకుఁడి సోదరుపాద రేణువుల్
శిరమునఁదాల్చి కొల్తునిఁకఁ జేసితి మీయెడ నెన్నియో మహా
దురితములన్ దురంతమగు ద్రోహములం గణియింపకండి; సో
దరునకుఁదెల్పి నన్నుఁ దమదాసునిగాఁ గొనునట్లు చూడుఁడీ!

బాణ—ఇదియేమి? సాగ్రజీమహారాజావారా! పరివారమెచ్చట? దిక్కుమాలియిక్కడ నక్కి నక్కి తెక్కి వెక్కి దొంగతోడువలె తెచ్చుచున్నారు! రండు,

ఈబంగారుగొల్సుల మీ రంగారు ముంగేలు సింగారింపనిండు. రాణావారిముం
గల నన్ని సంగతులు మనవి చేసికొందురుగాని దయచేయుండు.

జయ—కవిశిరోమణీ! శరణార్థియగు నీతని నిప్పుడేల యెత్తిపొడిచెదరు! రాణావారి
యెదుట కిట్టులే మసలోడ రానిండు.

రాణ—కుమారా! నానున్న మామగారు గదాయని గౌరవముచూపుచున్నావా?
నీయిష్టితమే కానిమ్ము.

[అంత చాటుచు జాంఘికుఁ డొకఁడు ప్రవేశించును.]

చ॥ నతులుగ్రహింపఁగఁ బసదనంబులు గైకొనఁగ న్బహూకృతుల్
నుతులు గొనంగరండు స్వజనుల్ రిపుజైత్రుఁడు మాప్రతాపభూ
పతి దయచేయు నిప్పుడు సభాస్థలికిన్ విజయప్రమోద స
త్కృతుల స్వయంబుగా నొసఁగ, కీర్తిరమంగొనఁ బంటకాఁడిదే.

రాణ—జయసింహకుమారా! రమ్ము రమ్ము! నేఁడు నీకు విజయపారితోషికమ్ములు
కుప్పలు కుప్పలు. రాణావారిప్రకటన వినియుంటివిగదా! రయమ్మునఁ బోదు
మురమ్ము.

(అందఱు నిష్క్రమింపఁగాఁ దెరజాఱును)

రంగము—ఉదయపురపుకోట.



[ప్రతాపసింహుఁడు, అమరసింహుఁడు, పృథ్వీరాజు ఉచితాసనములపయి
విశ్రమించియుందురు.]

ప్రతా—ఆర్యా! పృథ్వీరాయా! జయసింహుఁడు శిక్షార్హుఁడే.

చ॥ రవి తనత్రోవదప్పిన ధరాతలముం దివి రెండు నేకమై
నవసిన నగ్నిచల్లఁబడినన్ శశి దుల్లిన నీప్రతాపభూ
ధవుని యమోఘశాసనము తప్పదు, వాదమదేల దేశవి
ప్లవకరులౌ కృతఘ్నజనపతుమ్మనం బృథివీతలేశ్వరా! 134

పృథ్వి—దేవా! నాదొక్కమనవికలదు. చిత్తగింపవలయును.

మ॥ జయసింహుం బిలిపించి యాతని సమస్తుంబట్టి దైధోత్రిమాభ్ర భా
వయశ్శ్రాస్థాంశము తెల్లఁ జెల్పి మును తద్వ్యాజ్ఞాలఘూతించి త

ద్దయు తత్పక్షమువారి సాక్ష్యము సమాధానంబునుం జిత్తగిం
చి యటులయిట్లాయెనర్పఁ డాపయిభవచ్చిత్తంబు తద్భాగ్యముక.

ప్రతా—సరే! మీరుచెప్పునది సమంజసమేగాని ఏడీ! అజయసింహుఁ డిప్పు డెక్క డనున్నాడు?

అమర—ఎక్కడనున్నాడు! నిన్న నే మానసింహాదులతోఁ గలిసి ఢిల్లీకి పాఱిపోయి యుండును. కాని నిన్న నారాజద్రోహియగు జయసింహుఁడు మోహినీ పేర తుండయి సలీము మానసింగులఁ గోటదాఁటించుటయు, ఎదిరింపఁజనిన నాపయి డీకొనుటయుఁ గొంచెము దూరములోనుండి తమ కన్నులతోనే చూచుచున్న మామయ్యగారు పృథ్వీరాయలుకూడ నిట్లనుట నా కత్యద్భుతముగ నున్నది. సమయమున కాతురమ్మ-యోధు లిరువురు ఖాసటగానున్న నీపాటి మాపా ట్లేమయియుండి యుండునో.

పృథ్వీ—అవును మోహినీజయసింహుల రూపమునున్న యిరువురు మనుష్యులట్లుచే యుట నేనుచూచియున్నాను. కాని చిరంజీవి యూహించినట్లు వారుతప్పిం చుకొని పాఱిపోలేదు. ఖాణకవి వారిని పట్టుకొనినాఁడు.

ప్రతా—అయిన సంతోషమే. కాని కవిశిరోమణి యేలాకో వారినింక నిందుఁ దోడ్తేలేదు.

పృథ్వీ—వేట్రిదర్బారునకుఁ దోడ్కొనివచ్చునేమో.

ప్రతా—సరియే వారువచ్చినవెనుకనే విమర్శింతము. కాని మఱచితి. నిన్నటియుద్ధము లో చిరంజీవికిఁ దమంతన ఖాసటయై ప్రాణావసరసమయమునఁ దోడ్పడిన యోధానుయోధు లాతురమ్మ-వీరు లిరువురు నింకను యుద్ధపారితోషికములంది యుండలేదు. వారిప్పు డెందున్నారో?

పృథ్వీ—అభ్యంతర మందిరమున. సెలవైనఁ బ్రవేశ పెట్టుదును.

ప్రతా—మంచిది. సత్వరముగ.

పృథ్వీ—(నిష్క్రమించును.)

[ఖాణకవి జయసింహ సాగరజీలతోడను మోహినీ జయసింహులరూపములనున్న గులాము చంద్రికశిలతోడను ప్రవేశించును]

ఖాణ—(హజారమునందియే) మిత్రమా! జయసింహ! ఈతొందరలో సత్యంశావ సర కార్యమే పరాకుచెందితిని. రత్నపురీరణమల్లుని కానసప్రకారము నేఁడు తెరపింపఁదగు గుప్తఘేట్రికి మనసాంకేతికస్థలమున విడిచివచ్చితివి.

జయ—సరే! నేఁబోయి దానిని కొనివచ్చెదను.

బాణ—ఉన్న పాటున రావలయును.

జయ—(నిష్క్రమింపఁగా తక్కినవారు రాజసముఖమునకు వత్తురు).

ప్రతా—కవిశిరోమణీ! స్వాగతము. సమయమునకే విచ్చేసితిరి. ఈతఁడెవ్వరు? సాగరిజేయా?

బాణ—మునుపటితమ్ముఁడు కాఁడు. పశ్చాత్తాపతప్తుఁడగు సోదరుఁడు.

ప్రతా—కవిశిరోమణీ! ఈతనివిషయమున మీరేదో చెప్పఁదలఁచుకొని నట్లున్నది. ఆ సంగతి వెనుకనుండి యాలోచింతము. ముందు మోహినీజయసింహులను మాయెదుర నిలుపుఁడు.

బాణ—(అట్లుచేసి సాగరజేని తీసికొనిపోవును.)

ప్రతా—కవిశిరోమణీ! అతని యుక్తస్థలమున నిలిపి మీరు రయమున రావలయు. ఈ విచారణమందు మీసాక్ష్యమే ముఖ్యము.

[పృథ్వీరాజు తురష్కయోధుల వేషములనున్న కమలామోహినులతో ప్రవేశించును]

ప్రతా—(లేచి నిలఁబడి చేతులుపట్టుకొని.)

ఉ. రంత మదాప్తులిర్వురు తురుష్కులు మీరలైనన్ నమస్కృతుల్
గొందు, మదీయనందనునకున్ దగుబాసటలై స్వకీయ దో
ర్దండ బలంబుకల్మిఁ దటిఁ బ్రాణములిచ్చిరి, మీరు మేలు నె
న్నండును మఱ్వఁజాలను ఋణంబును దీర్పఁగఁజాలమేమిటన్.

ఉభయు—దేవరవారి ప్రాణముతోడిదే లోకమను భృత్యవర్గములోని వారము. మాకింత ప్రత్యుద్ధానమేల?

అమర—విజాతివారైన నట్లుండవలెగదా యభిమానము.

కమలా—కుమారా! భగవంతుని దృష్టి కన్నిజాతులులేవు. రెండేజాతులు. స్త్రీజాతి పురుషజాతి. అయినను మేము మీరు విజాతివారమనుచున్నారు గనుక నిప్పటికి మీచిత్తమువచ్చినట్లే భావింపుఁడు.

పృథ్వీ—ఏమి వీరిమాటల సందిగ్ధము. ఆదినుండియు వీరివేషభాషలు నాకుసంశయాస్పదములుగానే యున్నవి.

క. వేషములుచూడ పురుషుల
వేషములేగాని మీఁది పెదవులపై లే

మీాసములుగాని పురుషా

భ్యాసంబులుగాని కానఁబడ వదియేమో. 136

ప్రితా—పృథ్వీరాయా! మీారుచెప్పినట్లు ముం దీమోహినీజయసింహులపై మోపఁబడి న నేరము విచారింతము. మనమిత్ర ఉభయులు నిందు ప్రాడ్వివాకులుగా నుండఁ బ్రార్థితులు.

ఉభ—(ఒండొరుల మోములు చూచుకొనుచుందురు.)

ప్రితా—మిత్రరత్నములారా! సందేహింతురేల?

కమలా—మాకేసందేహమునులేదు. నేరస్థ లంగీకరింపవలయునుగదా!

ప్రితా—(మోహినీ జయసింహరూపులతో) మీాకిష్టమేనా?

గులాం—అచ్ఛా! అచ్ఛా!

ఉభ—సరే! అంగీకరించితిమి. ద్రోహస్వభావము వినిపింపఁదగు.

ప్రితా—వీరు దేశవిరోధులగు సలీం మానసింగులను కోటదాఁటించి రాజద్రోహమను నేరముచేసిరి. అంతతోగాక నిరోధించిన యువరాజును జంపనుంకించి రాజ హత్యోద్యమమను గొప్ప నేరమును చేసిరి.

ఉభయు—చిత్రము. (దోషులతో) ఈనేరములను మీారుచేసినారా?

గులాం—చేసిందీనహీఁసర్కార్. మేముచేసింది అంతా ధర్మం. ద్రోహంకాదు. నేరంకాదు.

అమర—ఇదేమిజయసింహా! తురకల నాశ్రయించినంతనే తురకభావముబ్బవలెనా! క్రమముగా మాటలాడుము.

కమలా—వానియిచ్చవచ్చినట్లు మాటాడనిండు. వానిభావతో మనకుఁ బనిలేదు. (చంద్రికతో) ఓయువిదా! పయినేరములను నీవుచేసియుంటివా!

చంద్రి—(నిర్లక్ష్యముగా) లేదు.

అమర—చూచితిరా వీరిసాహసము!

కమలా—యువరాజా! ఇప్పుడు మీారేమియు ననరాదు. విచారణమధ్యమున మనమెట్టి యభిప్రాయమును సూచింపరాదు.

ప్రితా—ఓయీ! యువకుఁడా! అడిగినదానికి సదుత్తరము చెప్పుము. నీవు జయసిం హుఁడేవగుదువా కావా?

గులాం—నైనై. మేము పక్కారకం తుర్కాబిడ్డ. హమ్ ఖుడ్కీ పట్టి హమ్ ఖుడ్ నామ్ సెహేదీ హమారీ యిస్లామ్ మే నహీ. మేరేనామ్ మనూరె మహమ్మద్.

హోదా గులామ్, సాకీన్ ఢిల్లీషహర్. గూఢాచారసర్కార్ సలీమ్, మస్లిమ్ దార్ రాజామాన్సింగ్ దోఆర్మీ మేం జఫర్దస్తమే ఖిల్లా దాటించిరియేసి నామ్. మాకీ అది ద్రోహం కాదు ధర్మం.

ప్రితా—సరే! ఓయువతీ! నీ క్షేమేని చెప్పుకొందువా!

చంద్రి—అతిపవిత్రంబగు శిశోదియావంశజాతనగు నేనీ కొలువు కూటంబున నిందతిచే విచారణచేయఁబడుటయే చాలును. నేనేమియుఁ జెప్పఁదలఁచుకొనలేను. మీచిత్తానుసారము చేయుఁడు.

కమలా—ఏమే! సాఁరఁజీ ప్రతికయుగు మోహినిభాయి వీనగునునో కావో చెప్పుము.

చంద్రి—కాకేమి?

మోహి—నీవు మోహినివా! (కోపముతో) ద్రోహిణీ! నీవేనా మోహినివి? ఏదీ! నామోమువంకఁ జూడుము.

చంద్రి—ఓ కోటుకుకకా! ఇట్టి నిండుకొలువుకూటంబున మాబోటి బోటుల పరిహసించుటకా నీకిట్టిబుద్ధి కార మీయఁబడినె.

కమలా—(మోహినితో రహస్యముగా) నెచ్చెలీ! శాంతింపుము. నిజమునిలుకడపై తేలక తప్పదు. మధ్య మనకేల కంఠశోషము.

[అంత బాణకవియు, గులాము వేషమున జయసింహుఁడును గుప్తపేటికతోఁ బ్రవేశింతురు.]

ప్రితా—కవిశిరోమణీ! రండు రండు. (సభ్యులతో) ఆర్యులారా! అత్యంతపవిత్రమైన కార్య మిపుడొకటి జరుగవలసియున్నది. కావున క్షణకాల మీవిచారణ విరమింతము.

అందఱు—మహాప్రసాదము.

ప్రితా—(పేటికనువిప్పి) ఇయ్యది కులవృద్ధ రత్న పురీరణ:గల్లుఁ డుదయపురిము స్వాధీనమైననాఁడు తెలుపింపవలయునని మావశముచేసిన పేటిక. నేఁడు మా కుదయపురము స్వాధీనమైనది గనుక మీ యువతి సముఖమున దీనిఁ దెఱచి యిందు నిక్షిప్తమైన వాని వెలిఁబుచ్చెదము.

మోహి—(అత్యంతాతురతతో గమనించుచుండును.)

ప్రితా—ఇం దమూల్యములగు రత్నాభరణములుకలవు. వానికేమి? అతఁడొక శాసనమువ్రాసియుంచెను. ఆకర్ణింపుఁడు.

చ. కలదు మదీయపౌత్రి సుగుణాత్రి పవిత్రచరిత్ర మోహినీ
కులమణి తల్లిచావు పసికూన యొకండిది, దీనినీయఁగా
వలయు శిశోదియాధ్వజము ప్రపథమంబున నీయుదేపురీ
గడెమున నాటువాని కులకాంతగ నాదగు రాజ్యలక్ష్మితోఁ.

వింటిరా! ఆకులవృద్ధశాసనము. ఏదియెట్లయినను మన మారణమల్లుని శాసనము చెల్లింపవలయు.

బాణ—తప్పక చెల్లించితీరవలయు. కాని మనబావుటా మొట్టమొదట ఈ కోటలో నాటినవారెవ్వరో?

పృథ్వి—జయసింహుఁడే యనుచున్నారు.

బాణ—(నవ్వుచు) కాదు గులాముని కొందఱనుచున్నారు.

జయ—దేవా! ఉదేపురి గడెమున దేవరవారి పతాకమెత్తిన సేవకుఁడ నేను.

ప్రతా—ఇదియేమి సర్వము సంధిగ్ధముగానే యున్నది. విప్పిన కొలంది చిక్కుపడుచున్నది. మోహినీజయసింహుల రూపములనున్న యీవేషధారు లెవ్వరో తెలియదు. నిజమయిన మోహినీజయసింహులజాడ కానరాదు. ఢిల్లీని విడిచి యుదయపురము చేరినదని బాణకవిచెప్పిన నాసోదరి కమలాబాయి యిక్కడ నెక్కడను గానరాదు. ఈతఁ డెవ్వరో యింతముందుగా జయధ్వజము నాటినవాఁ డనుచున్నాడు. కాని యింత సర్వత్ర యొక్క విచిత్రము మాత్రము కన్పట్టుచున్నది. శత్రుమిత్రపక్షములు తాఱుమాఱైనవి.

కమలా—చిత్తము. శత్రుమిత్రలక్షణము బహిర్వేషములను బట్టియే నిశ్చయించిన నట్లే కన్పట్టును. ఈకాలములో కొందఱు రాజబంధువులే రాజద్రోహముల రహస్యముగాఁ జేయుచు, జేయించుచు సాధులగు పెఱవారియెడలమీఁద నావాదు వేయుచున్నవారు. ఇప్పు డామాటలేల. శిశోదియాజయధ్వజము తొలునొల్ల నీగడెముపై నెలకొల్పిన శుద్ధవీరుఁ డీగులాము వేషధారియే. తత్సమయమున నాతఁ డొక సింహనాదమొనర్చి తన్నువారించు వారెవ్వరేని యున్నారాయని పెద్దయెలుంగున ప్రతిజ్ఞ చేసెను.

బాణ—అందు సత్యేతర మించుకంతయు లేదు.

ప్రతా—అయిన రణమల్లుశాసన ప్రకారము మనమోహిని నీతనికిచ్చి వివాహముచేయ వలసినదే! [illegible] గ్రంథకర్తకే ఈమె [illegible] దేవరయ్య! ఓపసభ్యులారా! [illegible] కొందఱ కొక విజ్ఞాపనము.

చ. సరవి నిగూఢవేషముల సభ్యులు మమ్ము భ్రమింపఁ జేసి మా
తరమగునే నిజంబెఱుఁగ, దాఁచకుఁడీ జయసింహుఁ డేఁడి? సో
దరి కమలాకుమారియు సుతాయని మోహిని యేది? వీర లి
ర్వురు నెవ రింక భ్రాంతిసుడిఁ ద్రోయక యున్నటు లన్వచింపుఁడీ.

బాణ—(లేచి చేతులు జోడించుకొని) ప్రభూ! కొంతవఱకెఱుఁగకయుఁ గొంతవఱకు వినోదము కొఱకు నొనర్చిన మా యపచయము క్షమింపవలయు.

సీ. పూనిగులాము రూపు జయస్వాంబెత్తె
సింహాసనత్వాఁకు జయసింహుఁ డిశేఁడు,
మగవేషమున నప్రమత్త సోదరుఁ
దఱిఁగాచె మోహినీతరుణి యామె,
చెఱఁబాపికొన జయసింహుఁ డిచ్చిన వస్తు
ల సలీము నెనపె గులాము లీఁక,
వంచించుటను జేసు వడె నిది మాచంద్రి
కళయను చెనఁటి బోఁగంపుఁదొత్తు
పాచుపామోఁది కని ఢిల్లిఁ బాసి యుదయ
పురిఁ బ్రవేశించి మోహిని ముప్పుఁ బాప
చిత్రకారిణి యౌచు విచిత్రగతుల
మనకుఁ దోఁప్పడె కమలాకుమారి యామె. 139

ప్రతా—(సంతోషముతో)

ఉ. ధన్యుఁడనైతినయ్య సిగదామసు వాడక యుండఁ దోఁడి రా
జన్యులు బాధుమిత్రికతి సన్నిధిఁ బెన్నిధు లట్లు త్రోఁచి రిం
క న్యశమైన నేమికలుగన్ సరియే మణి మహా చితూరుగా
కన్యవిచార మేది హృదయంబున లే దవశిష్ట మద్ది నేఁ 140

బాణ—దేవా! తమకావిచారమేల? ఉదయపురమువలెనే చిత్తూరును స్వాధీనము కాక తప్పదు. కాని కొంచెము కాలము పట్టును.

ప్రతా—కానీ! దైవచిత్తము! గులాముకు క్షమించినారము. తలపుంచిన పనుపుతెత్తిక చంద్రికతో గులాముకు పెండ్లిచేసికొన్నచో క్షమింపఁబడును. తక్కినవన్నిఁ గతు లిప్పు డభ్యంతరమందిరమున జరుగుచున్న కుటుంబసభలో నాలోచింతము. మనవారు తమ తమ నిజరూపములతో నాపక్షమున రాఁ బ్రార్థితులు.

(అందఱు నిష్క్రమింతురు.)



## రంగము—కోట. రాణావారి యభ్యంతర మందిరమునకుఁ బోవుమార్గము.

---

[లోపున రాణావారు బంధుమిత్రులతో విశ్రమించియుండఁగా మార్గమున కమలామోహినులుచితవస్త్రాలంకృతులై ప్రవేశింతురు.]

కమలా—కోమలా! రమ్మన్న రమ్ము. అభ్యంతరమందిరమున కిప్పుడే జయసింహాము లగు మనబంధువు లందఱు విచ్చేసియున్నారఁట.

మోహి—అప్పాజీ! ఇదేమోగాని నాకు రాకున్నది. కరుణించి యీకొక్కెముం జుక సవరించుఁడు. ఇందాఁక దయమాలి మాలిని బిగించివేసినది.

కమలా—ఏకొక్కెము? పైఁటబిగింపు కొక్కెమా! (వచ్చి సవరించి) దీని నింత బిగియఁజేసినది మాలిని కాదు.

మోహి—ఆమెగాక మఱియెవ్వరు?

కమలా—నీయౌవనప్రారంభము. మోహినీ! ప్రియనామోచ్చారణమే యింతయు ల్పింపఁగలయునే నీకోమరుఁ బాయంపు—సుందరీ! చీరసింగారించుకొనుసరికే యూరుమాటుమణిగెనన్న సామ్యము నిజముసేయక వడి వడిరా! మనకై వారు వేచియుండుట భావ్యముకాదు.

మోహి—అదియేమోగాని వారిని సందర్శించుటకు నాకడుగులు తడఁబడుచున్నవండీ! కరుణించి మీకైదండ యొసంగరా?

కమల—వధూమణీ! కైదండవలయునా? ఇదేపూదండ. దీని మా జయసింహకుమారున కొసంగినచో నీకతఁడు తనకైదండ నొసంగఁగలఁడు.

మోహి—అప్పాజీ! పోనిమ్మురమ్మా! మాట మాటకు హాస్యములేనా? ఆస్థానము సమీ[illegible] మీ[illegible] మారెం మాతకు[illegible]

[తెరలేచును. లోపల ప్రతాపాదులు విశ్రమించియుందురు.]

ప్రతా—జయసింహకుమారా! నీఋణము మేము తీర్పఁజాలము.

మ. తోడుగఁ దిండికి లేక కొండగుహాలందుండిన మాకాత్మ బం
ధుఁడవై మిత్రుఁడవై జయప్రదుఁడవై దోఃబుట్టువై యెన్నిరో
కడగండ్లం బడి నేఁ డుదేపురిఁ బతాకం బెత్తి మత్తారి జై
త్రుఁడవై మెప్పితివయ్య నీఋణమిఁ కేరూపంబునం దీర్తుమో.

బాణ—ప్రభుచంద్రమా! జయసింహుని ఋణమిప్పుడే తీరిపోయినది.

ప్రతా—ఎట్లు?

బాణ—దేవరవారి వాగ్దానముచే సగము, ఇప్పుడు చేయనున్న కన్యాప్రదానముచే మిగిలిన సగము.

ప్రతా—(నవ్వి) అట్లా! ఇట్టిదానము లెన్నియేనియు వానియభిమానమునకుఁ దగిన బహుమానములు కానేరవు. ఏదీ! వధూమణియగు మనమోహిని నింక నలంకరించి తీసికొనిరాలేదా?

బాణ—ప్రభూ! వచ్చినారు. అదిగో సోదరి కమలాదేవిగారు మోహినీద్వితీయులై యచ్చట వేచియున్నారు.

ప్రతా—(లేచి) ఏదీ నాప్రియసోదరి కమల. (వచ్చి చేతులుపట్టుకొని)

మ. ఇరువంశంబుల నుద్ధరించితివి తల్లీ! వంశపావిత్ర్యమున్
పరువున్ నిల్వఁగఁబెట్టి ధూర్తమతి నక్బర్ పాదుషా యంతవా
డరికట్టన్ తృణమట్లు చూచి నిజపాదాక్రాంతు గావించె నీ
చరితం బశ్రుతపూర్వ మోగుణఖనీ! సౌశీల్యచూడామణీ. 142

బాణ—మహాప్రభూ! దేవిగారుచేసిన సహాయము లింక ననేకములుగలవు. తరుణమున ధనసహాయము; జయసింహుని బంధవిమోచనము; చిత్రశాలినిద్వారా మనకు దుర్గరహస్యము తెలియఁగించుట. మోహినికిఁ బ్రాణదానము.

కమలా—కళ్యాణీ! ఇది మీ దయాశీర్వాద ఫలముగాని నాచేసినదేమున్నది! (చేరి తన భర్తయగు పృథ్వీరాజునకు నమస్కరించును.)

పృథ్వీ—(చేరదీసి) కల్యాణీ! నీవంటి యర్ధాంగలక్ష్మిని బడయు భాగ్యము కల్గుటచే నెంతయు గర్వపడుచున్నాను—

ప్రతా—సోదరీ కమలా! ఆలస్యమేల కుమారునకు కోడలిచేఁ బూలహారము వేయింపుము.

మోహిని—(సిగ్గుపడి వెనుకకుబోవును.)

కమలా—మోహినీ సిగ్గేల. (బలవంతముగా జయసింహుని మెడలో పూలహారము వేయించి వధూవరులచేఁ బెద్దలకు మ్రొక్కించును.)

ప్రతా—మిత్రులారా! పశ్చాత్తాపతప్తుఁడగు సాగరజీ క్షమింపఁబడిరి. బాణకవి శిరోమణి ప్రధానమంత్రిపద మంగీకరింపఁ బ్రార్థితులు. ఇఁక చిత్తూరు సాధింపు ప్రయత్నములు నిరాఘాటముగా జరుగునుగాక. మోహినీజయసింహులు రత్నపురిని పట్టాభిషిక్తులయ్యెదరుగాక.

బాణ—ప్రభుచంద్రమా! మహాప్రసాదము.

భరతవాక్యము.

రాయలు నిరంకుశత గ్రాలెడు ప్రభుత్వముఁ దొ
 ఆగి నియమంబుగఁ బ్రజాభి
ప్రాయమును గొంచు పరిపాలనముఁ జేయునెడ
 పాడియును పంటయును భవ్యా
దాయములు వృద్ధియగుతన్ ప్రజలు ధర్మగతి
 దప్పక ధరాధిపుల భక్తిన్
మాయయును మర్మమును మాయఁగనుఁ గొల్చుతఁ గ్ర
 మంబుగను మంగళమహాశ్రీ.

అందఱు—తథాస్తు.

సమాప్తము.